





## చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 నంవత్సరాలకు | 52.00 |
| నంవత్సర చందా | 18 00 |
| ఎయిర్ మెయిల్ (1 నంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 నంవత్సరం) | 45.00 |

చందాలు పంపవలసిన చిరునామా :

**విజ్డమ్**
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004


# ఈ సంచికలో

మే 1984



★

ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ:
శ్రీ ఎ. కె. మూర్తి, బొంబాయి-6.

★

**తెలుగు 'విజ్‌డమ్'కు ఇది మూడవ సంవత్సరం**

# సంపాదకుని పేజీ

## మంచితనం బలహీనత కాదు!



జేమ్స్ ఎలెన్

మంచితనం మానసిక జాడ్యం కాదు. ఉజ్జ్వలమైన గొప్ప సుగుణం అది. దాని ప్రత్యక్ష నిదర్శనాలు: బలం, శక్తి! మంచివాడు ఎన్నడూ బలహీనుడు కాడు; బలహీనుడు మంచివాడు కాలేడు.

కచ్చితమైన నిజం ఏమిటంటే - చెడ్డవాని 'చెడు' వాడికి సర్వ వినాశనం కలిగిస్తుంది. మంచివాడి 'మంచి' అతనికి సుఖ సంతోషాలు చేకూరుస్తుంది.

ములగ చెట్టులాగ చెడ్డవాడు తాత్కాలికంగా కొన్నాళ్లు పచ్చ పచ్చగా కనిపించవచ్చు. కాని ఏ రవంత గాలి వేసినా ఫెళ్ళ ఫెళ్ళ విరిగి కూలిపోయే ఆ చెట్టు దుర్గతే చివరికి అతనికీ పడుతుంది.

## సంగీతంలో ఉన సమ్మోహన శ



మనిషికి ఇంకా ఇంకా సుఖ సంతోషాలు చేకూర్చాలని సైన్సు, సంగీతం ఈ నాడు పోటా పోటీలు పడుతూ ముందుకు సాగుతున్నాయి. అయితే - తక్కిన వాటికి లాగే సంగీతానికీ రెండు ప్రక్కలు ఉన్నాయి. ఒక ప్రక్క అది మన రక్తప్రసార వేగం

## మొట్టమొదటి పొలిటీషియన్

క్రిస్టఫర్ కొలంబస్ - మొట్ట మొదటి పొలిటీషియన్! ఎందుకంటే - తను ఎక్కడికి వెళుతున్నాడో తనకు తెలియదు. ఒక దేశం చేరుకున్న తరువాత అది ఏ దేశమో ఎరుగడు. తను చేసిన పనులన్నీ ఇతరుల డబ్బుతోనే చేశాడు!

"వివాదం ఎంతకూ తెగలేదంటే అర్థం: తప్పు రెండు వేపులా ఉందని!" —వోల్టేర్

హెచ్చించనూ గలదు. మరో ప్రక్క మన నరాలను శాంతపరచి మనస్సును జోకొట్టనూ గలదు.

సంగీతం జబ్బులు నయం చేస్తుంది; ఉత్తేజన ఇస్తుంది; ఉత్సాహం కలిగిస్తుంది; ప్రేరేపిస్తుంది. రాజకీయపు గోడలు దాని నడ్డ లేవు. 'ప్రిజమ్'లో నుంచి ప్రసరించే కిరణం లాగ ఏ 'ఇజమ్'లో అయినా అది ఇంద్ర ధనుస్సులా వికసించ గలదు. సంగీతం సమ్మోహన పరుస్తుంది. ఉల్లాసం కలిగిస్తుంది; కంట తడి పెట్టిస్తుంది. జాగరూకులుగా చేస్తుంది; నిద్ర రూపుతుంది. నవ్విస్తుంది, ఏడిపిస్తుంది. ఏ రకం సంగీతం మనం వింటున్నాం అనే అంశం మీద అది ఆధారపడి ఉంటుంది.

సంగీతం మనకు టానిక్ లాగ పని చేస్తుంది. రక్త ప్రసార వేగం తగ్గి, జీవ శక్తి మందగించిన రోగికి డాక్టర్లు ఉత్తేజకరమైన సంగీతాన్ని వినిపిస్తారు. రక్తపు పోటు ఎక్కువగా ఉన్న వారికి తాపీగా సాగే శాంతమైన సంగీతం మంచిది. గుండె జబ్బుతో బాధపడే వారికి లయాత్మకమైన సంగీతం మేలు చేస్తుం దని భావిస్తున్నారు. లయ లోపించడం వల్లనే శారీరకమైన అలసట కలుగుతుంది. చర్చిలలోనూ, దేవాలయాలలోనూ కూడా ఆ యా సందర్భాలకూ, ఆ యా ఋతువులకూ తగిన సంగీతాన్ని వినిపిస్తూ ఉంటారు. మనస్సుకు వికాసం కలిగించి, ఆత్మ ప్రబోధం చేకూర్చే సంగీతం అక్కడ మనం వింటాము.

## బొమ్మలలో హాస్య

### ర్తలలో క్షేమ, క్షామాలు



సంగీతం నరాల అలసటను తగ్గిస్తుం దనే భావం కొత్త దేమీ కాదు. 2,000 సం. ల క్రితమే గ్రీక్‌లకు ఈ సంగతి తెలుసు. రోగ చికిత్సకు సంగీతాన్ని వాడుక చెయ్యా లని ప్లేటో, పైతాగరస్‌లు సూచించారు. ప్లేటో, ఆయన సహచరులూ తెల్లవారుజామునే లేచి ప్రార్థన గీతాలు పాడేవారు. తరువాత విద్యార్థులు వచ్చి విద్యాభ్యాసం చేసేందుకు అనువైన వాతావరణాన్ని అవి కలిగిస్తాయని వారి భావన.

మధ్య యుగాలలో అంటు జాడ్యాలు వ్యాపించిన తరుణాలలోనూ, నిదుర పట్టక బాధపడే సందర్భాలలోనూ రోగుల బాధోపశమనకు డబ్బిచ్చి గాయక బృందాలను ఏర్పాటు చేసే ఆచారం ఉండేది. సంగీతం ప్రభావం ఎంత గొప్ప దంటే-వారాల తరబడి

"తమ తెలివి తేటల్లో సగం అప్పు పుట్టించడానికీ, తక్కిన సగం అది ఎగవేయడానికీ కొందరు ఉపయోగిస్తారు!" —జార్జ్ డి. ప్రెంటిస్

నిద్ర పట్టక బాధపడే రోగులు కూడా సంగీత చికిత్సా ప్రభావం వల్ల ఆదమరచి నిద్రపోయే వారట!

తలనొప్పులనూ, నిస్పృహా భావాలనూ నయం చేయడంలో సంగీతం పెట్టింది పేరు. మనకు చిరాకుగా ఉన్నప్పుడు మనకు తెలియకుండానే ప్రక్కనున్న రేడియోను ట్యూన్ చేయడం_దీనివల్ల మళ్ళీ ఉత్సాహాన్ని పుంజుకోడం తరుచు జరుగుతూ ఉంటుంది. సంగీతం మనలో ఉత్సాహాన్ని పురికొల్పి, లోకం అంతా రంగు రంగులుగా కనపడేట్టు చేస్తుంది.

న్యూయార్క్ (అమెరికా) లోని ఒక ఆసుపత్రి తాలూకు సంగీత సమాజం 1923 నుంచీ అక్కడి రోగులకు ఎన్నెన్నో సంగీత కచేరీలు ఇచ్చింది. వేర్వేరు రోగులకు వేర్వేరు రకాల సంగీతం వినిపిస్తారు. ఆరోగ్యానికి ఇతర వినోదాలనూ, క్రీడలను ప్రిస్క్రైబ్ చేసినట్టే సంగీతాన్ని కూడా ప్రిస్క్రైబ్ చెయ్యవచ్చునంటూ ఒక సుప్రసిద్ధ డాక్టరు గ్రామఫోన్ రికార్డులతో కూడిన సంగీతపు 'మెడికల్ చెస్ట్' కూడా ఒకటి ప్రతి డాక్టరు దగ్గిరా ఉండాలని సూచించారు.

ఆరోగ్యం మీద సంగీతం ఎలా పని చేస్తుంది? సంగీతం తాలూకు ధ్వని తరంగాల స్పందనలు రోగి నరాలలో అనుకూల స్పందనలు కలిగిస్తాయి. క్రమంగా అవి ఐచ్ఛిక, అనైచ్ఛిక కండరాలకూ, వివిధ గ్రంథులకూ, హృదయానికీ కూడా ప్రాకి వాటిని మెరుగు పరుస్తాయి. సంగీతానికి సాహిత్యం తోడైతే దాని ప్రభావం మరింత ఎక్కువ!

ఈ కాలపు 'జాజ్' సంగీతం (Rock 'N' Roll లాంటి సంగీతం) రోగులకు చిరాకు కలిగించవచ్చును. కాని తగిన వాద్యాల మీద వాయించే శాస్త్రీయ సంగీతం ఔషధం లాగ పని చేస్తుంది. వేణునాదం పిరుదు నరానికి సంబంధించిన 'పియాటికా' జబ్బును

## వ్యాయామం చేస్తే గుండె జబ్బు రాదు



బోస్టన్ (అమెరికా) విశ్వవిద్యాలయం లోని శాస్త్రవేత్తలు 27 మలేషియా కోతులతో ఒక ప్రయోగం చేశారు. 'కొలెస్ట్రాల్' ఎక్కువగా ఉన్న ఆహారం ఇస్తూ కొన్ని కోతులచేత పరుగులు పెట్టించి వ్యాయామం చేయించారు. మరికొన్ని విశ్రాంతిగా ఉన్నాయి. 23 నెలల అనంతరం వ్యాయామం చేసిన కోతుల రక్తనాళాల గోడలలో క్రొవ్వు తక్కువగానూ, చెయ్యని వాటిలో ఎక్కువగానూ పేరుకోడం గమనించారు. మానవులలో కూడా వ్యాయామం చేసే వారిలో రక్తనాళాల గోడల మందం పెరిగి గుండె జబ్బు వచ్చే ప్రమాదం తక్కువ అని వారు ప్రక

"బాధలకు భయపడే వాడు భయంతో బాధ పడుతాడు!"

కుదర్చ గలదు. నరాల జబ్బులకు వీణ లాంటి వాద్యాలు మంచివి. 'సెంట్ వైటస్ డాన్స్' లాంటి తీవ్ర లక్షణాలు గల ఒక నరాల జబ్బుతో బాధపడే కుర్రవాడికి సంగీతంవల్ల ఆ జబ్బు నయమైంది. ప్రేలుడు ధ్వనికి దర్శన నాడి (optic nerve) స్తంభించి పోయి అంధుడైన ఒక వ్యక్తికి సంగీతం వల్ల తిరిగి చూపు వచ్చింది. యుద్ధ బీభత్సాలు చూసి మూగ అయిన ఒక ఇటాలియన్ బాలునికి సంగీతం వినడం వల్ల మళ్ళీ మాటలు వచ్చాయి.

ఉత్పత్తిని పెంచడంలో కూడా సంగీతం సాయపడుతుంది. రెండో ప్రపంచ సంగ్రామంలో కొందరు సైనికులు క్రుంగిపోయి ఉన్న సందర్భంలో సంగీతం ద్వారా వాళ్ళను తిరిగి ఉత్సాహ భరితులను చేశారు. వారిలో ఉత్పాదక శక్తి 2 మొదలు 11 శాతం వరకూ పెరిగింది. ధైర్య, సాహసాలు పెల్లుబికాయి. ఒక సిగరెట్ల కంపెనీలో పరధ్యానాన్ని, అజాగ్రత్తనూ అరికట్టడానికి మూడు సంగీతం 'పీరియడ్'లను ఏర్పాటు చేశారు. సంగీతం వల్ల అందరి చేతులూ లయానుగుణంగా కదల సాగాయి. పని వారిలో అలసట తగ్గి, ఉత్పత్తి పెరిగింది.

సంగీతానికి సమ్మోహన శక్తి ఉంది. మనకు ఇష్టం ఉన్నా, లేకపోయినా సంగీతం మన మీద ప్రభావం చూపుతుంది అని మన శాస్త్రవేత్తలు అంటున్నారు. వేగంగా ద్రుత గతిలో సాగే సంగీతం మన నాడి, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, రక్తప్రసారాల వేగాన్ని హెచ్చిస్తుంది. తాపీగా విలంబ కాలంలో సాగే సంగీతం ఆ వేగాన్ని తగ్గిస్తుంది. కష్టించి పని చేసేటప్పుడు ఉత్తేజకర మైన సంగీతాన్నీ, విశ్రాంతి వేళలలో ప్రశాంతమైన సంగీతాన్నీ వినిపిస్తారు.

మన ఆలోచనలకు కూడా సంగీతం ప్రేరేపణ కలిగించ గలదని కొందరి భావన. ఒక

(మిగతా 58 వ పేజీలో)

## కస్తూరి మృగాల జాతి అంతరించి పోయే ప్రమాదం



హిమాలయాలలో ఉన్న 20,30 వేల కస్తూరి లేళ్ళను కస్తూరి కోసం ఏటా విచ్చలవిడిగా వధిస్తున్నారు. ఏటా వాటి నుంచి 200 కిలోల కస్తూరి తీస్తున్నారు. అంతర్జాతీయ విపణిలో కస్తూరి ధర కిలో 50,000 డాలర్లు పలుకుతూంది. కస్తూరి లేడి లైంగికావయవం ముందు భాగాన ఉన్న ఒక గ్రంథి నుంచి ఈ కస్తూరి తీస్తారు. ఒక్కొక్క లేడి నుంచి 25 గ్రాముల కస్తూరి లభిస్తుంది. అయితే — ఈ విధంగా భారీ ఎత్తున ఈ లేళ్ళను వధించటంవల్ల క్రమంగా ఆ లేడి జాతి అంతరించిపోయే ప్రమాదం ఏర్పడుతూంది.

"ఇతరు లందరూ వివేకం కోల్పోయినప్పుడు నువు వివేకం ప్రదర్శిస్తే నువ్వే ఆ గుంపంతటిలో పొడుగైన వాడివి."

# జీవితం నేర్పిన పాఠాలు

## "అధికారం, సంపదలూ శాశ్వతం కావు"

జనరల్ కె. యమ్. కరియప్ప



[భారతీయ సైనిక చరిత్రలో ఆరితేరిన సేనానులు బహుకొద్ది మందే కనిపిస్తారు. అలాంటి కొద్దిమందిలో మన మాజీ సైనిక ప్రధాని జనరల్ కరియప్ప ఒకరు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో ఇరాన్, సిరియా, ఇరాక్, బర్మా (అరకాన్) రంగాలలో ఆయన యుద్ధం చేశారు. 1949 మొదలు 1953 వరకూ ఆయన భారత సర్వ సైన్యాధ్యక్షులుగా ఉన్నారు. 1950 మే నెలలో అమెరికన్ అధ్యక్షులు ట్రూమన్ 'లీజియన్ అఫ్ మెరిట్' డిగ్రీ ఇచ్చి ఆయనను సత్కరించారు.]

"ఏ పని నీకు ఒప్పగించినా ఇతరులు గుర్తించగలిగిన తప్పులే కాక, ఏ తప్పులూ దొర్లకుండా ఏకాగ్రతతో ఆ పని చెయ్యి!"

ఎవ్వరూ ఈ ప్రపంచంలో 'తప్పనిసరి' (indispensable) కారు. ఇతరులతో

## మనిషి మనస్సు మీద భూమి అయస్కాంత క్షేత్ర ప్రభావం

మద్రాసు శరీర శాస్త్రవేత్త్రి డా. శారదా సుబ్రహ్మణ్యం, హైద్రాబాద్ నేషనల్ జియో ఫిజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (NGRI) డిప్యూటీ డైరెక్టర్ డా. శంకర నారాయణ్‌లు మనిషి మనస్సు మీద కనిపించే భూమి అయస్కాంత క్షేత్ర ప్రభావాన్ని పరిశోధించి, ఉత్తర దిక్కుగా తల పెట్టుకొని పడుకుంటే మనస్సులో చిరాకు, కలవరం, నిస్పృహ కలుగుతాయనీ, తూర్పువైపు పడుకోడం వల్ల మనశ్శాంతి, చురుకుదనం లభిస్తాయనీ ప్రకటించారు.

---

"బుద్ధి ఉన్నవాడెవడూ మంగలినీ, నటుణ్ణీ,
బిచ్చగాణ్ణీ, లోభినీ సలహా అడుగడు!" —పంచతంత్రం

వాదించేటప్పుడు కోపం రావడం మన స్వభావంలోని దౌర్బల్యానికి చిహ్నం: మన వాదంలోని బలహీనతను కప్పిపుచ్చుకునేందుకు వాడే లొసుగు అది!

నీతో మాట్లాడుతూ మాట్లాడుతూనే తగినంత కారణం లేకుండా నవ్వే పురుషుణ్ణి, తగినంత కారణం లేకుండా కంట తడిపెట్టుకునే స్త్రీనీ ఎన్నడూ నమ్మకు!

ఏదో స్వార్థాన్ని ఆశించి ముఖప్రీతి కోసం పొగిడేవారి మాటలు పట్టించుకోకు! అలాంటి వారి విషయంలో జాగ్రత్తగా ఉండకపోతే వారు నిన్ను మూర్ఖుడుగానో, అమాయకుడుగానో జమకట్టే ప్రమాదం ఉంది.

తేనెటీగలాగ వ్యక్తిగతమైన ఎలాంటి ప్రతిఫలం కోరకుండా సాయశక్తులా మానవజాతికి సేవ చెయ్యి!

ఇతరుల నానంద పరచడమే నీకు ఎక్కువ ఆనంద దాయకం కావాలి!

దేశానికీ, ప్రజలకూ సేవచేసే అవకాశాల కోసం తప్ప, వ్యక్తిగతమైన అధికారాన్నీ, ఐశ్వర్యాలనూ సాధించే అవకాశాల కోసం చూడకు!

ఇతరులు నిన్ను ఏ దృష్టితో చూస్తారో అలా నిన్ను నువ్వు చూసుకోడం నేర్చుకో! నీకు ఇష్టం లేని మాటలు నిన్ను గురించి ఎవరైనా అంటే ఉడుకుమోతుతనం తెచ్చుకోకు. దైవానుగ్రహం వల్ల జీవితంలో ఏదైనా ఉన్నత పదవిని నువు అధిరోహించడం సంభవిస్తే ఆకాశంలో విహరించకు. దృఢంగా ఈ నేలమీద కాళ్ళు ఆన్చి నిలబడు! గుర్తుంచుకో—అధికారం, సంపదలూ శాశ్వతం కావు. ఉన్నత పదవిలో ఉన్నప్పుడు నీ అధికారాన్నీ, బలాన్నీ నిజాయితీతో నీ తోటి వారికి చేతనైనంత ఎక్కువగా సేవ చెయ్య, దానికే వినియోగించు!

## 'నవ్వు'లో ఉన్న మహిమ!



"నవ్వడం వల్ల ధనం నష్టపోదు. అయినా దానిని అందుకొన్నవారికి అది ఎంతో మేలు చేస్తుంది. నవ్వడం క్షణంసేపు పట్టదు; కాని, దాని జ్ఞాపకం కలకాలం నిలిచి ఉంటుంది. ఎంత డబ్బున్నా, ఎంత బలం ఉన్నా 'నవ్వు' లోపాన్ని అవి తీర్చలేవు. సంసారంలో వెలుగునీ, వ్యాపారంలో సద్భావాన్నీ, మైత్రికి దోహదాన్నీ సమకూరుస్తుంది 'నవ్వు'! అలసిన వారికి విశ్రాంతినీ, కష్టంలో ఉన్నవారికి ఓదార్పునూ కలిగిస్తుంది 'నవ్వు'! జీవితంలో బాగా అలసిపోయి నవ్వలేనివారుంటారు కొందరు. మన 'నవ్వు'లు విసరడానికి అంతకంటె అర్హులు మరి ఉండరు—నమ్మండి!" —షేఖ్ మెండోన్కా

"సాధ్యమైన దానికంటె ఎక్కువ మంచిగా ఉండా లనుకోడం పెద పొరపాటు!" —వాల్టర్ బేగహాట్

జీవితంలో ఎదురయ్యే సమస్యలను పరిష్కరించుకోడంలో అచంచలమైన ధైర్యం, ఆత్మ విశ్వాసం, సౌశీల్యం ప్రదర్శించు. మహత్తరమైన ప్రాచీన వారసత్వం గల నీ భారత జాతిలో విశ్వాసం పెంచుకో!

నీ ధ్యేయం ఉచిత మైందీ, సాధించదగిందీ అయినంతవరకూ నీలో దృఢ సంకల్పం గనుక ఉంటే జీవితంలో నువు సాధించలేని దంటూ ఏదీ ఉండదు. ప్రతి 'కోన్ కిస్కా' కీ అన్నీ తెలుసు ననీ, అతడు సజ్జనుడనీ నమ్ముతూ, ఆ నమ్మకం వమ్ము కావడంతో దిగాలు పడిపోతూ, నీకు నువ్వే శత్రువువి కాబోకు. చెప్పుడు మాటలవల్ల ఎవరిని గురించీ అభిప్రాయాలు ఏర్పరచుకోకు. స్వయంగా స్వంత అనుభవంతో మనుష్యులను అంచనా కట్టు!

ఇతరులకు ఇచ్చేది ఎక్కువ, వారి నుంచి స్వీకరించేది తక్కువ అయిన వ్యక్తి జీవితంలో ఎన్నడూ విచారించడు.

నామ రూప రహితుడైన భగవంతుడు నీ ఆలోచనలలో నిరంతరం మెదులుతూ ఉండాలి. దేవుడి మీది నీ భక్తి మానవజాతికి సేవ చేయడంలో నీకు తోడ్పడుతుంది.

నీ తరువాతి తరం వారు పూర్తిగా నీ తరంవారి లాగే ప్రవర్తించా లని ఆశించడం పొరపాటు. ప్రపంచంలో అతి శీఘ్రంగా సంభవిస్తున్న పరిణామాలవల్ల ప్రతి తరంలోనూ ఎంతో మార్పు వస్తుంది. అయితే - సంఘం పట్ల వ్యక్తి బాధ్యతలకు సంబంధించిన ప్రాతిపదిక సూత్రాలు మాత్రం - ఏ తరంలోనూ మారనివి - కొన్ని ఉన్నాయి.

'మనిషి'లో ఉండే 'మంచి'ని చూడడానికే ఎప్పుడూ ప్రయత్నించు. స్వతః 'మనిషి' మంచివాడు. నీ 'శత్రువు' మీద దయ చూపించు. అయితే - భౌతికంగానూ, నైతికంగానూ నువ్వు దృఢంగా ఉండడం అవసరం.

మానవ జాతికి సేవ చేసేందుకు అనేక అవకాశా లున్నాయి. కాని, అందుకు తగినంత వ్యవధి నీకు లేదు. అల్పమైన ఈ జీవితంలోని

(మిగతా 64 వ పేజీలో)

## ట్రాఫిక్ రద్దీని గుర్తించే ఇన్‌ఫ్రా-రెడ్ డిటెక్టర్



సీమెన్స్ కంపెనీ తయారు చేసిన ఒక కొత్తరకం ఇన్‌ఫ్రా రెడ్ డిటెక్టర్‌వల్ల రోడ్ మీద ఒరపిడి మూలాన పుట్టిన వేడిని గుర్తించి తదనుగుణంగా ఎరుపు, ఆకుపచ్చ దీపాలను చూపడం సాధ్యం అవుతుంది. ఈ డిటెక్టర్లను ట్రాఫిక్ లైట్లకు పై భాగాన అమరుసారు.

"కష్టాలను చాలామంది ఎదుర్కోగలరు;
కాని ద్వేషాన్ని ఎక్కువమంది తట్టుకోలేరు!" -ఫుల్లర్

# ఆందోళన అరికట్టేందుకు సులభసూత్రాలు

డా॥ క్లైవ్ ఏ. హార్లీ

ఆందోళనతో, ఆదుర్దాతో కూడిన యుగం మనది. జీవితంలో వేగం, చుట్టూ విని పించే రణగుణ ధ్వనీ, ప్రక్కవారితో పోటీ- ఇవి అన్ని మనలో చాలామందిలో భయా లనూ, ఆందోళనలనూ కలిగిస్తున్నాయి.



నిజమే - కొన్ని చికాకులు మనం తప్పించుకో లేనివే; కాని, చాలా విషయాలు సర్వ సామాన్య మైనవి; వేదాంత ధోరణిలో తీసు కుంటే మనకు ఎలాంటి హానీ అవి కలిగించ లేవు. జీవితంలో నిత్యం ఎదురయే సవాళ్ళను ఎదుర్కోడానికి మనం ఏం చేయాలి?

ఆందోళనలను అరికట్టేందుకు ఆచరణ యోగ్య మైన కొన్ని తేలిక చిట్కాలు ఉన్నాయి:

1. మొదటిది: మనస్సులోనే పెట్టుకుని మథన పడకుండా పైకి చెప్పుకుని, ప్రశాం తంగా వాటిని గురించి ఆలోచించడం. ఒక కాగితం, కలం తీసుకోండి. మీకు ఆందోళన కలిగిస్తున్న అంశా లన్నిటినీ వరుసగా దాని మీద వ్రాయండి. వాటిలో చాలా భాగం అస్పష్ట మైన, అనవసర మైన భయాలే అయి ఉంటాయి.

2. వివిధ సమస్యలను విడమరచి చూడండి. ప్రతి సమస్యలోనూ ఉన్న వాస్త వాంశాలను గుర్తించండి. ఈ విషయంలో చాలా కచ్చితంగా ఉండాలి.

3 అనుసరించ దగిన వివిధ పద్ధతులన (alternatives) కాగితం మీద వ్రాసు కోండి. "ఇలా జరిగితే నేనేం చెయ్యాలి? ఎలా ప్రవర్తించాలి?" అని ఆలోచించండి.

4. సాధ్యం అయితే వెంటనే నిర్ణయం తీసుకోండి. ఎలా ఎలా జరిగేందుకు అవకా

---

## రికార్డు ధర పలికిన ఫ్రెంచ్ రాజు కొయ్యు పెట్టె

ఫ్రెంచ్ విప్లవ కాలంలో ఉరి తీయబడే రోజు వరకూ ఫ్రెంచ్ రాజు 16వ లూయీ వాడుక చేసిన ఒక కొయ్య పెట్టెను ఇటీవల లండన్‌లో జరిగిన వేలం పాటలో 14 లక్షల డాలర్లకు పాడారు. ఫర్నిచర్ అంత ధర పల కడం ప్రపంచంలో ఇదే మొదలు!

"కష్టాలను ముందుగా ఆశంకించేవాడు
రెండు సార్లు వాటిని అనుభవిస్తాడు!" —పోర్టియస్

శాలు ఉన్నాయో క్షుణ్ణంగా పరిశీలించి నిర్ణయం తీసుకోండి. అనవసరంగా కాలయాపన చెయ్యకండి. సుప్రసిద్ధ మనశ్శాస్త్రవేత్త విలియమ్ జేమ్స్ "అదే పనిగా ఆందోళన చెందుతూ ఉండడం కంటె రైటో, తప్పో ఏదో ఒక నిర్ణయం తీసుకోడం మంచిది" అంటారు. అది ఒకవేళ తప్పు నిర్ణయం అని తేలినా - కనీసం ఆ ప్రత్యేక పరిస్థితులలో సాధ్యం అయిన ఉత్తమ నిర్ణయం తీసుకున్నట్లు మీరు గుర్తిస్తారు. శత విధాల మీరు తీసుకునే నిర్ణయం సరియైనదే అవుతుంది.

5. నిర్ణయాన్ని వెంటనే అమలు జరపండి. అలా కార్యరంగంలోకి దిగడంవల్ల మీ భవిష్యత్ ఆందోళనలను మీరు అరికట్ట గలుగుతారు.

6. రోజూ కొంత కాలాన్ని — పావు గంటో, అరగంటో — 'ఆందోళన పడడం కోసం' అని కేటాయించుకోండి. దానివల్ల తక్కిన సమయాలలో ఆందోళన లేకుండా పోతుంది. "ఈ విషయమై రేపు ఇన్ని గంటలకు ఆందోళన పడవచ్చులే!" అని మీకు మీరు నచ్చచెప్పుకోవచ్చును. ఆందోళన పడే సమయంలో మీ సమస్యల జాబితా ఎదురుగా ఉంచుకుని పూర్తిగా ఆందోళన పడండి. మీ సమస్యలు ఎంత హాస్యాస్పదమైనవో త్వరలోనే మీరు గుర్తిస్తారు. ఒక నెలరోజులు పోయాక మీ సమస్యలు వాటంతట అవే మటుమాయం కావడం మీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. క్రమంగా ఆందోళన పడేందుకు కొంత కాలాన్ని కేటాయించుకోవలసిన అవసరమే లేకుండా పోతుంది.

ఆందోళనను అరికట్టేందుకు పై ఆరు సూత్రాలూ చక్కగా ఉపయోగపడుతాయి. అయితే అసలు ఆందోళన పడే స్వభావాన్నే పూర్తిగా మార్చుకోడం సాధ్యం అవుతుందా? ఎలాంటి ఆందోళనా లేని పై ఖరిని జీవితం పట్ల అలవరచుకోడానికి సరళమైన ఈ క్రింది సూచనలు కొంతవరకు తోడ్పడుతాయి:

* ఎప్పుడూ ఏదో ఒక పనిలో మునిగి తేలుతూ ఉండండి. మనస్సు ఖాళీగా ఉన్న

---

## సిగరెట్ త్రాగడం వల్ల సంభవించే మరణాలు



అమెరికాలోని ఏ ఇతర 'డ్రగ్' కంటె సిగరెట్లు ఎక్కువగా వ్యాధులనూ, మరణాలనూ కలిగిస్తున్నాయని 'యు. ఎస్. పబ్లిక్ హెల్త్ సర్వీస్' వారు వాషింగ్టన్‌లో ప్రకటించిన ఒక కరపత్రం తెలుపుతూంది. రోజుకి 18 గంటలు పని చేస్తూ 2 పాకెట్‌ల సిగరెట్‌లు కాల్చే వ్యక్తి 400 సార్లు పొగ పీల్చడం, 1,000 మిల్లీ గ్రాముల తారును ఊపిరి తిత్తులలోకి పంపడం జరుగుతుంది.

---

"అర్థమైనదీ చదివి, చదివిన ప్రతిదీ గుర్తుంచుకునే వాడు చదువుకున్న మూర్ఖుడు!" — జోష్ బిలింగ్

ప్పుడే ఆందోళనలు చోటు చేసుకుంటాయి. ఏక కాలంలో రెండు విషయాలను గురించి మనస్సు పట్టించుకో లేదు. సర్వదా ఉపయోగ కర మైన విషయాలలో మనస్సు చురుకుగా పని చేస్తూ ఉండేట్టు చూడండి!

* ఏమి మాట్లాడుతున్నారో తూచి, తూచి మాట్లాడండి. తరచు మీ మాటలలో నిరాశా, నిస్పృహలు ధ్వనిస్తూ ఉంటాయి. దాని వల్ల మీ ఆందోళన మరింత పెరుగుతుంది. సంతోషకర మైన విషయాలు మాట్లాడండి. నిస్పృహ ధ్వనించే మాట నాలుక చివరకు వస్తే దాన్ని ఆపుచేసుకుని సరదాగా మాట్లాడ డానికి ప్రయత్నించండి. దీనివల్ల తోటివారికి మీరు మరింత ఇష్టులు అవుతారు. ఎప్పుడూ తమ కష్టాలే వెళ్ళబోసుకునే వారి మాటలు వినడం ఎవరికైనా చికాకుగానే ఉంటుంది.

* రోజు అంతటినీ పూర్తిగా వినియో గించుకోండి. "దైవానుగ్రహం వల్ల ఈ పనులన్నీ ఈ రోజు నేను పూర్తి చేయగలను" అనుకుంటూ మీ దినచర్య ప్రారంభించండి. ఆ మాటే పదే పదే అనుకుంటూ, ప్రతి నిముషాన్నీ లాభదాయకంగా వాడుకోవా లని గట్టిగా సంకల్పించండి.

* వర్తమానంలో జీవించండి. ఏ రోజు కా రోజు కొత్త మనిషిలాగ జీవించడాన్ని గూర్చి డేల్ కార్నెజీ వ్రాశాడు. 'నిన్న'నూ, 'రేపు'నూ గూర్చి పూర్తిగా మరచిపోయి ఈ రోజును గడపడం ఆందోళనలకు తిరుగులేని మందు అంటా రాయన. 'ఇవాళ' దృష్టితోనే ప్రతి రోజూ జీవించడం అలవరచుకోండి.

* మనశ్శాంతిని సాధన చెయ్యండి. సంతోషం కలిగించే ఆలోచనలతోనే మన స్సును ఎప్పుడూ నింపుకోండి. తీరిక సమయా లలో అలాంటి జ్ఞాపకాల సర్వస్వాన్ని తయారు చేసుకోండి. వినోదయాత్రల తాలూకు జ్ఞాప కాలూ, మీరు చదివిన మంచి పుస్తకాలలోని రసవద్ఘట్టాల జ్ఞాపకాలూ మీకు మేలు చేస్తాయి. రోజూ ఇలాంటి విషయాలను గురించి కొన్ని నిముషాలు ఆలోచిస్తూ ఉంటే త్వరలోనే సంతుష్టి చేకూర్చే జ్ఞాపకాల లైబ్రరీ ఒకటి మీరు నిర్మించుకో గలుగుతారు.

---

## మిక్కిలి పెద్ద సమాధి!



ఈజిప్ట్‌లో 5,000 ఏళ్ళ క్రితం నిర్మించిన 'ది గ్రేట్ పిరమిడ్ ఆఫ్ చియోప్స్' ప్రపం చంలో నిర్మించబడిన మిక్కిలి పెద్ద సమాధి. రోమ్‌లోని సెంట్ పీటర్స్ చర్చ్, లండన్ లోని వెస్ట్ మినిస్టర్ కెతెడ్రల్-రెంటినీ తనలో ఇముడ్చుకో గలిగినంత పెద్ద సమాధి అది. 65 లక్షల టన్నుల బరువు గల రాళ్ళు పేర్చి లక్షమంది 20, సం.ల పాటు శ్రమించి నిర్మించిన కట్టడం అది!

"తక్కువ వారినుంచి ఉపకారాలు స్వీకరించకు: వాటికి చాలా ఎక్కువ మూల్యం చెల్లించవలసి వస్తుంది." —హెచ్.ఎల్. మెంకెన్

# భూప్రదక్షిణం

## దక్షిణ కొరియా రిపబ్లి

ప్రత్యేకమైన ఒక భాష, సంస్కృతి, సంప్రదాయం ఉన్న మిక్కిలి ప్రాచీనమైన దేశం కొరియా. ఉత్తర ఆసియా ఖండంలో దక్షిణంగా వ్యాపించి ఉన్న ఒక చిన్న ద్వీపకల్పం ఇది. ఉత్తర, దక్షిణాలుగా సుమారు 1,000 కి.మీ.ల పొడవూ, తూర్పు పడమరలుగా 216 కి.మీ.ల కనీసపు వెడల్పూ ఉన్న ఈ ద్వీపకల్పం జపాన్ దీవుల వైపుగా విస్తరించింది.




ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం 1945 లో ఉత్తర, దక్షిణ కొరియాలుగా రెండు భాగాలుగా ఈ దేశం విభజించబడింది. కమ్యూనిస్టుల అజమాయిషీ క్రింద ఉన్న ఉత్తర కొరియా విస్తీర్ణం 1,22,279 చ. కి.మీ.లు. 'రిపబ్లిక్ ఆఫ్ కొరియా' అనబడే దక్షిణ కొరియా విస్తీర్ణం 98,955 చ.కి.మీ.లు.

కొరియా రిపబ్లిక్ (దక్షిణ కొరియా) లో

---

### ఆరోగ్యానికి కాఫీ!

రోజూ మూడు కప్పుల కాఫీ త్రాగుతూ ఉంటే, ముఖ్యంగా వయస్సు పై బడిన వారికి అది చురుకుదనాన్నీ, ఉల్లాసాన్నీ కలిగిస్తుం దని పెన్సిల్వేనియా స్టేట్ యూనివర్సిటీలో ఆహార శాస్త్రం ప్రొఫెసర్ మాన్ ఫ్రెడ్ క్రోజర్ ప్రకటించారు. అయితే - కాఫీ మరీ ఎక్కువగా తాగితే దానిలోని 'కాఫీన్' వల్ల అల్సర్, గుండె జబ్బు, కాన్సర్ వంటి వ్యాధులు వచ్చే ప్రమాదం ఉంది.

---

"పరమాత్మను తెలుసుకోడం, ఆయనను సేవించడం ఇంతకు మించిన జ్ఞానం వేరే లేదు."

-గురు నానక్

కొండలు చాలా ఎక్కువ. ఇక్కడి భూభాగంలో 76 శాతం కొండలే. తూర్పుతీరం వెంబడి మిక్కిలి ఎత్తైన పర్వతాలు ఉన్నాయి ఆ పర్వతాలలో పుట్టిన పెద్ద పెద్ద నదులు పశ్చిమంగా ప్రవహించి 'యెల్లో సీ' (పసుపు సముద్రం)లో కలుస్తున్నాయి. పర్వత పంక్తి పట్టణం 'ఇంఛాన్' రాజధాని నగరం 'సియోల్'కు పశ్చిమంగా ఉంది.

చరిత్ర పూర్వయుగంలోనే మంచూరియా నుంచి వలస వచ్చిన మంగోలియన్ ఆదివాసుల తెగలు ఏకమైపోయి ఒక ప్రత్యేకమైన జాతి—చైనీయులకంటె, జపానీయుల



కొరియాలోని బౌద్ధాలయం

వెంబడే దక్షిణంగా ప్రవహించి దక్షిణ సముద్రంలో కలిసే నదులూ కొన్ని ఉన్నాయి.

కొరియన్ రిపబ్లిక్‌కి మొత్తం 17,300 కి.మీ.ల సముద్రతీరం ఉంది. చేపలు పట్టే రేవులూ, పరిశ్రమలు వృద్ధిపొందిన రేవులూ, వాణిజ్యపు రేవులూ ఈ తీరరేఖ వెంట అనేకం ఉన్నాయి. అంతర్జాతీయ ప్రసిద్ధి పొందిన మిక్కిలి పెద్ద ఓడరేవు 'పూసాన్' ఈ ద్వీపకల్పానికి ఆగ్నేయపు కొసను ఉంది. దీని తరువాత చెప్పుకోదగిన మరో పెద్ద రేవు

## హిమాలయాల కడ్డంగా తొలి మోటారు యాత్ర

మొట్టమొదటి సారిగా హిమాలయాలను దాటడానికి బయలుదేరిన 9 మోటారు కార్ల దళం 10,000 కి.మీ. ల దూరం ప్రయాణించి గత అక్టోబరు 7న విజయవంతంగా ఆ యాత్రను ముగించింది. ఆ 9 కార్లలోనూ 24 గురు యాత్రికులు ఉన్నారు. వారిలో ఓ.ఎన్.జి.సి.లో పని చేస్తున్న ఒక మహిళ కూడా ఉంది.

"నింద పడని వాడు లోకంలో ఎవడూ లేడు!" —గౌతమ బుద్ధుడు

కంటే విలక్షణమైన జాతి — ఇక్కడ ఏర్పడింది.

శతాబ్దాల తరబడి కొరియన్‌లు అందరూ యూరల్-ఆల్టిక్ కుటుంబానికి చెందిన ఒకే భాష మాట్లాడుతున్నారు. చాలా ఆసియా భాషలతో కంటే ఈ భాషకు టర్కిష్, ఫిన్నిష్, హంగేరియన్ భాషలతో ఎక్కువ దగ్గిర సంబంధం ఉంది. 15 వ శతాబ్ది చివరి



అధ్యక్షుడు చున్‌డూహ్వాన్

దాకా చైనీయ లిపినే విలక్షణమైన, ప్రత్యేకమైన ఉచ్చారణతో కొరియన్‌లు వాడుకునేవారు. అప్పుడు ఒక విద్వత్ ప్రభువు సెజాంగ్ ది గ్రేట్ (1397-1450) చేత నియమించబడిన ఒక ప్రత్యేక సంఘం 'హాంగుల్' అనబడే 24 వర్ణాలతో కూడిన, ఉచ్చారణ విధేయమైన (phonetic) ప్రత్యేక కొరియన్ లిపిని రూపొందించింది.

1982 లో ద. కొరియాలో జనాభా 3.93 కోట్లు. ఈ జనాభాలో 60 శాతం ప్రస్తుతం నగరాలలో నివసిస్తున్నారు.

ఇక్కడి పురాణ గాథల ప్రకారం 4,000 ఏళ్ళనుంచీ ఈ దేశంలో నాగరక సమాజం ఉంది. క్రీ.పూ. 12 వ శతాబ్దంలోనే చైనా నుంచి వలస వచ్చిన 'కిజా' ఇక్కడ 'చోసున్' (ఉదయ సూర్యుడు) అనే ఒక రాజ్యం స్థాపించాడు. వందలాది ఏళ్ళు కొరియా మీద చైనా ప్రాబల్యం కనిపిస్తుంది. 13 వ శతాబ్దంలో మంగోల్‌లు దండెత్తి వచ్చి ఈ దేశ నాగరకతను చాలా వరకూ విచ్ఛిన్నం చేశారు. 1392 లో చైనీయుల సాయంతో కొరియన్‌లు మంగోల్‌లను తరిమి కొట్టారు.

1592 లో జపానీయులు కొరియా మీద దండెత్తి రాగా మళ్ళీ చైనీయుల సాయంతోనే కొరియన్‌లు వారిని ఓడించారు. అ

## స్వయంగా రికార్డు సృష్టించిన 'గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్స్'

ఇటీవలి కాలంలో మిక్కిలి ప్రజాదరణ పొందిన పుస్తకంగా 'గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్స్' ఒక కొత్త రికార్డు స్థాపించింది. 29 ముద్రణలు పొంది, 4.6 కోట్ల కాపీలు ఖర్చయిన ఈ పుస్తకం ఐస్‌లాండిక్, సెర్బో క్రోట్ (యుగోస్లావియా), హిందీ భాషలతో సహా ప్రపంచంలో మొత్తం 23 భాషలలో వెలువడుతూంది.

"తలలు నెరసిన రాజకీయ నాయకుల నిర్ణయాలకు అందరూ దాసోహం చెయ్యాలనడంలో నాకు నమ్మకం లేదు." —సుభాష్‌చంద్ర బోస్

తరువాత 300 ఏళ్ళు కొరియాకు చైనాతో సన్నిహిత సంబంధాలు ఉన్నాయి.

కొన్నాళ్ళు బయటి ప్రపంచంతో ఎలాంటి సంబంధాలూ పెట్టుకోకుండా ఈ దేశం 'సన్యాసి' రాజ్యం (hermit kingdom) గా ప్రసిద్ధి పొందింది. 1876 లో జపాన్ బలవంతంగా ఈ రాజ్యంతో వర్తక సంబంధాలను ప్రారంభించింది. కాలక్రమేణ, అమెరికా వంటి ఇతర దేశాలతో కూడా కొరియన్‌లకు వాణిజ్య సంబంధాలు ఏర్పడ్డాయి.



కొరియన్ బాలలు

వందలాది సంవత్సరాలు అసంఖ్యాకమైన శత్రువుల దాడులను ధైర్యంగా ఎదుర్కొని కొరియన్‌లు తమ జాతి అఖండతను కాపాడుకున్నారు. కాని 1910 లో జపాన్ బలాత్కారంగా కొరియాను ఆక్రమించి 35 ఏళ్ళు అక్కడ రాజ్యం చేసింది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం కొరియాకు స్వాతంత్ర్యం సిద్ధించింది కాని. 38 వ సమాంతరేఖ హద్దుగా ఆ దేశం రెండు ముక్కలుగా విభజించబడింది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన ఉత్తర కొరియాను రష్యా ఆక్రమించగా, ప్రధానంగా వ్యవసాయిక దేశం అయిన దక్షిణ కొరియాను అమెరికన్‌లు ఆక్రమించారు. సంయుక్త రాజ్యసమితి కొరియాను ఏకీకరించడానికి చేసిన ప్రయత్నాలు విఫలం అయాయి. 1948 లో రెండు ప్రత్యేక రిపబ్లిక్ రాజ్యాలు వెలిశాయి. ఉ. కొరియా 'డెమోక్రాటిక్ పీపిల్స్ రిపబ్లిక్ ఆఫ్ కొరియా'. ద.కొరియా 'రిపబ్లిక్ ఆఫ్ కొరియా'.

రష్యా మద్దతుతో ఉత్తర కొరియాలోని కమ్యూనిస్టులు 1950 లో దక్షిణ కొరియా మీద దాడి చేశారు. ఉత్తర, దక్షిణ కొరియాల మధ్య జరిగిన ఆ యుద్ధంలో అమెరికా, చైనా, మరి కొన్ని దేశాలూ కూడా పాల్గొన్నాయి 1953 లో జరిగిన యుద్ధ విరమణ సంధితో ఆ యుద్ధం ముగిసింది కాని యుద్ధం ఆగిపోయే నాటికి ఉత్తర, దక్షిణ కొరియాలు రెండూ సర్వ నాశనం అయాయి.

## 6 ఏళ్ళ వయస్సు గల చదరంగం ఛాంపియన్

సోవియట్ యూనియన్‌లోని ఆర్టిక్ ఓవెజోవ్ మూడో ఏటనే చదరంగం ఆడడం మొదలుపెట్టాడు. ఇటీవల తన 6 వ ఏట ఏక కాలంలో 20 మందితో ఆడిన ఆటల ప్రదర్శనలో 17 మంది మీద గెలిచాడు. ముగ్గురితో 'సమ ఆట' (draw) అయింది.

"స్వయంగా సాగు చెయ్యలేని వారి భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి!" —కాటిల్యుడు

10 లక్షల పైచిలుకు కొరియన్‌లు హతు లయారు. ఆ యుద్ధానికి సేనలు పంపిన ఇతర దేశాల సైనికులు కూడా కొన్ని లక్షలమంది హతు లయారు.

ద. కొరియా తొలి అధ్యక్షుడు డైన సింగ్మన్ రీ 1948 నుంచి 1960 దాకా అధి కారంలో ఉన్నాడు. ప్రజానీకం నుంచీ, సైన్యం నుంచీ లభించిన మద్దతుతో ఒక విద్యార్థి విప్లవం 1960 ఏప్రిల్‌లో అవినీతికి పేరు మోసిన సింగ్మన్ రీ ప్రభుత్వాన్ని కూల దోసింది.

డా. చంగ్ మియాన్ నాయకత్వాన రెండవ రిపబ్లిక్ ప్రభుత్వం ఏర్పడింది. ప్రజా స్వామ్యం పేరిట రాజకీయ రంగంలో యథేచ్ఛా ప్రవృత్తి ఏర్పడి, సాంఘిక సంక్షో భానికి దారితీసింది. 1961 మే 16 న మేజర్ జనరల్ పార్క్ చుంగ్ హీ ఒక సైనిక కుట్రతో ప్రభుత్వాధికారం చేజిక్కించుకొని ఆర్థికంగానూ, సాంఘికంగానూ దేశాన్ని ఆధు నికంగా చేయడానికి కృషి చేశాడు. 1963 డిసెంబరులో సైనిక ప్రభుత్వం స్థానే పౌర ప్రభుత్వం వెలసింది. పార్క్ చుంగ్ హీ యే అధ్యక్షుడుగా ఎన్నికై, 1979 అక్టోబరులో హత్య చేయబడేవరకూ 3 వ, 4 వ రిపబ్లిక్‌ల కాలంలో ద. కొరియాను పాలించాడు.

అధ్యక్షుడు పార్క్‌ని హత్య చేయడంతో జనరల్ చున్‌డూహ్వాన్ ఆ జాతికి నాయకుడు అయాడు. 1980 ఆగస్టు 27 న ఆయన అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. అక్టోబరు నెలలో ప్రజలకు పౌర, రాజకీయ హక్కు లను విశేషంగా కల్పిస్తూ 5 వ రిపబ్లిక్ రాజ్యాంగాన్ని ఆయన ప్రకటించారు. 1981 ఫిబ్రవరి 27 న ఆ కొత్త రాజ్యాంగం ప్రకారం తొలి అధ్యక్షుడుగా తిరిగి ఆయన ఎన్నిక అయారు.

వర్ధమాన దేశాలలో ఒకటిగా ఈ రోజున

(మిగతా 55 వ పేజీలో)

## ఐఫెల్ టవర్ పెచ్చులు సమకూర్చిన ఐశ్వర్యం



ఫ్రాన్స్‌కు చెందిన జీన్ కార్డాన్ 'ఐఫిల్ టవర్' తాలూకు పెచ్చులు అమ్మి కోటీశ్వరు డయాడు. మరమ్మతుల సమయంలో ఆ టవర్ నుంచి రాలిన పెచ్చులు 6½ టన్నులు 2,000 ఫ్రాంకులకు ఆయన వేలం పాటలో పాడాడు. వాటిని 22,000 చిన్న చిన్న ముక్కలుగా చేయించి ఐఫెల్ టవర్ ప్రసిద్ధిని ఉపయోగించుకొని ఒక్కొక్క ముక్కను 1,000 ఫ్రాంకులకు అమ్మాడు.

"నువు కొన్న ప్రతి మంచి పుస్తకంతోనూ
నీ వ్యక్తిత్వం ఒక మిల్లీ మీటర్ పెరుగుతుంది."

-హర్ దయాళ్

# భారత యోగులు

## భక్త పురందర దాసు

భగవదన్వేషణ పిచ్చిలో పడి భిక్షాధికారిగా మారిన ఒక లక్షాధికారి కథ - పురందర దాసు చరిత్ర. కర్ణాటక దేశంలోని భక్త కవులకు తలమానికం పురందర దాసు. విరోబా ప్రభువునీ, దక్షిణ భారత దేశంలో తాను సందర్శించిన వివిధ క్షేత్రాలలోని మూల విరాట్టులనూ కీర్తిస్తూ ఆయన పాడిన పాటలు 4 లక్షల పైచిలుకు ఉన్నట్టు చెబుతున్నారు. ఆ కీర్తనల ద్వారా కోట్లాది ప్రజల హృదయాలలో భగవద్విశ్వాసం అనే జ్యోతిని వెలిగించిన మహానుభావుడు పురందర దాసు. ఉపాసన, ఉపదేశం - రెంటినీ మిళితం చేసి 'హరి కథ', లేక 'హరి కీరన' అనే నూతన రూపాన్ని ఆయన సృష్టించారు. సరళమైన భాష, సంగీతానికి ఒదిగే నడక, సాహిత్య సౌరభం సమపాళ్ళలో కలపిన ఆయన కీర్తనలను 'దేవర్‌నామా', లేక 'దాసర్ పదగళు' అంటారు. 'పురంద రోపనిషత్తు' అని కూడా భక్తులు వాటిని ప్రశంపించడం కద్దు!



భక్త పురందర దాసు

కర్ణాటక రాష్ట్రంలోని బళ్ళారి జిల్లాలో హంపీ సమీపాన గల పురందర్ గడ్ అనే గ్రామంలో వరదప్ప నాయక్ అనే ఒక బ్రాహ్మణుడు ఉండే వాడు. బంగారం కొట్టు పెట్టి, న్యాయంగా వ్యాపారం చేస్తూ అతడు ధనం ఆర్జించాడు. చాలా కాలం ఆయనకు సంతానం కలుగలేదు. ఆయనకూ, ఆయన భార్య లక్ష్మీబాయికీ అది ఒక తీరని వేదన అయింది. చివరికి వెంకటేశ్వర స్వామికి మొక్కుకోగా, ఆ స్వామి దయ వల్ల 1491 లో వారికి ఒక కుమారుడు కలిగాడు. ఆ వెంకన్న మరో పేరు అయిన 'శ్రీనివాస్' అని ఆ కుర్రవానికి నామకరణం చేశారు.

### నుదుట ఒకే కన్ను

1793లో ఫ్రాన్స్‌లోని 'క్లెమెంట్' కుటుంబంలో నుదుట ఒకే కన్ను గల ఒక బాలిక పుట్టింది. తక్కిన శరీరం అంతా మామూలుగానే ఉన్న ఆ బాలిక 15 ఏళ్ళు జీవించింది.

"మూఢాచారాల నుంచి ముక్తుడైన వాడికి మృత్యు భయం ఉండదు!" —గురు నానక్

ఆ ఏకైక పుత్రుడు శ్రీనివాస్ అష్టైశ్వర్యాల మధ్య అల్లారు ముద్దుగా పెరిగాడు. ఉపనయనం కాగానే ఒక గొప్ప పండితుని వద్ద విద్యాభ్యాసానికి పంపారు. సకలశాస్త్రాలూ, సంస్కృత, కన్నడ భాషలూ బోధించడమే కాక సంగీతంలో కూడా ఆ కుర్రవానికి ఆయన ప్రవేశం కలిగించారు. 16 వ ఏట ఆ ఊళ్ళోనే బంగారపు బొమ్మలాంటి యోగ్యురాలైన సరస్వతి నిచ్చి శ్రీనివాస్‌కు వివాహం చేశారు.

20 వ ఏట శ్రీనివాస్ తన తల్లిదండ్రులను కోల్పోయాడు. తండ్రి వ్యాపారాన్నే శ్రద్ధగా కొనసాగిస్తూ, 10 ఏళ్ళలో ఆయన కోటీశ్వరుడు అయ్యాడు. అందరూ 'నవ కోటి నారాయణ' అనేవారు ఆయనను. ఒక కుమార్తె నలుగురు కుమారులూ కలిగారు.

ఐశ్వర్యం పెరిగిన కొద్దీ దానితో పాటు శ్రీనివాస్‌లో పిసినారితనం కూడా పెరుగసాగింది. తీర్థయాత్రలు చెయ్యడం, వ్రతాలూ, ఉపవాసాలూ చెయ్యడం లాంటి వన్నీ వట్టి తబ్బి దండుగ పనులుగా ఆయనకు కనిపించసాగాయి.

భార్య సరస్వతి ఇందుకు పూర్తిగా విరుద్ధం. ఆమె మిక్కిలి దైవభక్తి గలది. దేవాలయాలకు వెళ్ళి పూజలూ, పురస్కారాలూ చేయడం అన్నా, అతిథి, అభ్యాగతులను ఆదరించి అన్నం పెట్టడం అన్నా, దాన ధర్మాలన్నా, సాధు సజ్జన సాంగత్యం అన్నా ఆమెకు ఎంతో ఇష్టం. ఆమె వద్ద యాచనకు వచ్చి వట్టి చేతులతో తిరిగి వెళ్ళినవారు లేరు. అయితే - తన పిసినారి భర్తకు తెలియకుండా తాను దాన ధర్మాలు చెయ్యడం ఎలా సాధ్యం? అదో పెద్ద సమస్య అయింది ఆమెకు. తల్లిదండ్రులు తన కిచ్చే కానుకలు భద్రపరచి వాటితోనే ఆమె దాన ధర్మాలు చేయసాగింది. మంగళ సూత్రం, ప్రేమతో భర్త తనకు బహూకరించిన ముక్కెర మాత్రమే ఆమె వంటి మీద ఉండేవి.

ఒక రోజున 'పాండురంగ' అనే ఒక నిరుపేద బ్రాహ్మణుడు వచ్చాడు. కొడుకు ఉపనయనం చెయ్యడానికి ధన సహాయం

---

# అయస్కాంత క్షేత్రం మీద ఎగిరే మొదటి రైలు



ప. జర్మనీ రీసెర్చ్, టెక్నాలజీల బాన్ మంత్రిత్వ శాఖ 8.5 కోట్ల మార్కుల వ్యయంతో రూపొందించిన 'ట్రాన్స్ రాపిడ్ 06' లాంటి రైలు ప్రపంచంలో మరోటి లేదు. 54 మీటర్ల పొడుగూ, 120 మెట్రిక్ టన్నుల బరువూ కలిగి అయస్కాంత క్షేత్రం మీద పైన ఎగిరే ఈ రైలుకి చక్రాలు లేవు. ప్రయాణ సమయంలో దేనితోనూ ఒరపిడి లేనందువల్ల ఎలాంటి చప్పుడూ కాదు.

---

"'అస్పృశ్యత' కొనసాగితే హిందూమతం నశిస్తుంది: ఇండియాయే నశిస్తుంది!" — మహాత్మా గాంధీ

చెయ్యమని సరస్వతిని అర్థించాడు. అలాంటి సాయం చెయ్యడం ఎంతో పుణ్యం అని కొట్లో ఉన్న భర్త దగ్గిరికి అతణ్ణి ఆమె పంపింది. కాని, ఆ పిసినారి చిల్లి దమ్మిడీ కూడా ఆ బ్రాహ్మణునికి ఇవ్వడానికి నిరాకరించాడు. పైగా, కసురుకుని అతణ్ణి తరిమి వేశాడు. అయినా ఆ బ్రాహ్మణుడు నిరుత్సాహ పడలేదు. కొన్ని నెలలపాటు అదే పనిగా వచ్చి వారిని అర్థించసాగాడు.

ఒక రోజున శ్రీనివాస్ దుకాణం మయ్యబోతూ ఉండగా ఆ బ్రాహ్మణుడు వచ్చి 'భిక్షాం దేహి!' అన్నాడు. శ్రీనివాస్ అలమర అంతా గాలించి ఒక చెల్లని నాణేన్ని వెదికి తీసి, 'కృష్ణార్పణమ్' అంటూ అతని చేతిలో పెట్టాడు. 'ఈ నాణెం చెల్లదు నాయనా!' అంటూ బ్రాహ్మణుడు తిరిగి దానిని శ్రీనివాస్‌కు ఇచ్చి వేశాడు.

మర్నాడు బ్రాహ్మణుడు శ్రీనివాస్ ఇంటికి వెళ్ళి సరస్వతితో తన గోడు అంతా చెప్పుకున్నాడు. "ఎలాగైనా నువ్వు పుణ్యం కట్టుకోవాలి తల్లీ!" అని ఆమెను ప్రాధేయపడ్డాడు. ఆయన మాటలకు గుండె కరిగి సరస్వతి వెంటనే తన వజ్రాల ముక్కెర తీసి ఆ బ్రాహ్మణుని చేతిలో పెట్టింది. "స్వామీ! దీన్ని అమ్ముకుని మీ కుమారుని ఉపనయనం జరిపించుకోండి!" అంది.

బ్రాహ్మణుడు ఆ ముక్కెర తీసుకుని తిన్నగా శ్రీనివాస్ దుకాణానికే వెళ్ళి దానిని అమ్మజూపాడు. తాను తన భార్యకు బహూకరించిన విలువైన ముక్కెరను అది పోలి ఉండడంతో శ్రీనివాస్‌కు అనుమానం వచ్చింది. ఆ ముక్కెరను, ఒక చిన్న గుడ్డ సంచీలో పెట్టి ఇనుప పెట్టెలో భద్రపరచి, "నువు ఇక్కడే కూర్చో - ఇప్పుడే వస్తాను" అని బ్రాహ్మణునితో చెప్పి, తిన్నగా ఇంటికి బయలుదేరాడు. వెళుతూనే భార్యను "నేను నీకు ఇచ్చిన ముక్కెర ఏదీ?" అని గద్దించి అడిగాడు. సరస్వతి గజగజ వణికిపోయింది. ఒళ్ళంతా చెమట్లు పోశాయి. ఎలాగో మాట పెగుల్చుకుని "ఇందాక స్నానం చేస్తూ పడక గదిలో భద్రపరచాను. తెసా నుండండి"

## పురుషులలో గుండె జబ్బుకు కొత్త కారణం!



'అమెరికన్ జర్నల్ ఆఫ్ మెడిసిన్' ఇటీవలి సంచికలో ప్రకటించిన ఒక నూతన పరిశోధన ప్రకారం - పురుషుల రక్తంలో 'కొలెస్టరోల్' అధిక ప్రమాణంలో ఉండడం కాక, స్త్రీ లైంగిక హార్మోన్ 'ఎస్ట్రాడియోల్' అధికంగా ఉండడం గుండె జబ్బులను కలిగిస్తూంది.

---

"మూర్ఖులకే స్త్రీ పురుష విచక్షణ:
సత్పురుషులు ఇరువురినీ సమంగా గౌరవిస్తారు!" —కాళిదాసు

అంది. తిన్నగా పూజామందిరంలోకి వెళ్ళి దేవుడి ముందు సాష్టాంగపడి, "తండ్రీ! నువ్వే ఇప్పుడు నాకు దిక్కు: నువ్వే ఈ ఆపద గట్టెక్కించాలి:" అని వేడుకుంది.

తన భర్త ఆగ్రహానికి గురికావడం కంటె ఆత్మహత్యే మేలు అనుకుంది. ఒక కప్పు లోకి విషం వంపుకుని త్రాగడానికి సిద్ధపడింది. చిత్రంగా అంతలో ఆ కప్పులో ఏదో పడ్డట్టు చప్పుడయింది. వేళ్ళతో కప్పులో తడిమి చూస్తే దానిలో తన ముక్కెర ఉంది. సంతోషంగా ముందు గదిలోకి వెళ్ళి ఆ ముక్కెరను భర్తకు చూపించింది.

సంభ్రమాశ్చర్యాలతో శ్రీనివాస్ దుకాణానికి పరుగెత్తాడు. ఇనప్పెట్టె తెరచి చూశాడు. సంచీ సీలు సీలుగానే ఉంది గాని, దానిలో ఆ ముక్కెర లేదు. ఆ బ్రాహ్మణుని కోసం చూశాడు. చిత్రంగా అంతలోనే ఉన్నట్టుండి ఆయనా అంతర్ధానం అయాడు. ఆ భగవంతుని మాయ చూసి శ్రీనివాస్ నిర్ఘాంతపోయాడు. వడివడిగా ఇంటికి వెళ్ళి జరిగింది జరిగినట్టు నిజం చెప్పమని భార్యను నిగ్గదీశాడు. ఆనంద బాష్పాలు రాలుస్తూ జరిగిన ఆ చిత్రమైన సంఘటన అంతా పూసగుచ్చినట్టు సరస్వతి చెప్పింది.

ఆ సంఘటనతో ధనికుడూ, పిసినారీ అయిన శ్రీనివాస్ నాయక్ తల తిరిగి పోయింది. ధన లోభంతో జీవితం అంతా నిరర్థకం చేసుకున్నానే అని వాపోయాడు. ఆ పరితాపం వల్ల అతడు భగవంతుని అనుగ్రహానికి పాత్రుడయాడు. పరమ భాగవతోత్తముడుగా మారిపోయాడు. బ్రాహ్మణుని రూపంలో అన్ని సార్లు తన చుట్టూ తిరిగిన పాండురంగ విభుణ్ణి గుర్తించకపోతినే అని తల్లడిల్లి పోయాడు. భోగ భాగ్యాలన్నీ తృణ ప్రాయంగా వదలి భార్యనూ, పిల్లలనూ వెంట బెట్టుకుని భగవత్ సంకీర్తన చేస్తూ బయలు దేరాడు. విజయనగరం లోని రాజగురువు వ్యాసరాయని వద్ద ఉపదేశం పొందాడు. హరిదాసుడు (విష్ణుమూర్తి దాసుడు) అయి, 1564 లో సిద్ధిపొందే పర్యంతం అలా హరి దాసుడుగానే జీవించాడు.

(మిగతా 43 వ పేజీలో)

## అరుణాచల ప్రదేశ్‌కు రైలు మార్గం




'బాలిపర'నుంచి 'భలూక్‌పాంగ్'కి 40 కి. మీ.ల మేర వేస్తున్న రైలు మార్గం 1985లో పూర్తి అయితే — అరుణాచల ప్రదేశ్ ఇండియాలోని ఇతర ప్రాంతాలకు అందు బాటులోకి వస్తుంది. కలప, వెదురు మొదలైన అక్కడి అటవీ సంపదను ఎక్కువ వెక్కువగా ఉపయోగించుకోడం సాధ్యం కాగలదు.

"ఎలాగో జీవించడం కాదు గొప్ప - మన స్వల్ప జీవితంలో మనం ఏమి సాధించా మనేది ముఖ్యం!" —జవహర్‌లాల్ నెహ్రూ

# జాతీయ వార్తలు

## స్టాంపుల సేకరణలో ఇండియన్‌కు అంతర్జాతీయ గౌరవం:

స్టాంపుల సేకరణ రంగంలో సుప్రసిద్ధులైన కలకత్తా లోని డి. ఎన్. జాటియాను ఇంగ్లండ్‌లో 'వాత్'లోని స్టాంపులు సేకరించే ప్రముఖుల రిజిస్టర్‌లో సంతకం చేయడానికి ఆహ్వానించారు. ఆసియాలో ఎస్. ఇచిడా అనే జపాన్ దేశీయుని తరువాత ఈ గౌరవం ఈయనకే దక్కింది. ఆ రిజిస్టర్‌లో మొట్ట మొదటి సంతకం 5వ జార్జ్ చక్రవర్తిది!

* * *

## కేరళలో మొట్ట మొదటి పట్టు పురుగుల కేంద్రం:

కేరళలో కొట్టాయం జిల్లాలోని కంజిరా పల్లి సమీపాన గల పారతోడ్‌లో మొట్ట మొదటి పట్టు పురుగుల కేంద్రం స్థాపిస్తున్నారు. రూ. 4 లక్షల పెట్టుబడితో స్థాపించే ఈ కేంద్రంలో మల్బరీ పట్టు కాయల ఉత్పత్తికీ, సిల్క్ వస్త్రాల నేతకూ అవసరమైన హంగులన్నీ ఉంటాయి. కాంచీపురం పట్టుతో దీటు రాగల మేలి రకం పట్టు ఇక్కడ తయారు కాగలదు.

## హిమాలయాల మీద అడవుల అంతర్ధానం



చిప్‌కో ఉద్యమం నాయకుడు సుందర్లాల్ బహుగుణ ప్రకటన ప్రకారం ఒక క్రమ పద్ధతిలో హిమాలయాల మీది అడవులను కొట్టి వేయడం కొనసాగుతూంది. హిమాచల్ ప్రదేశ్‌లో ఆపిల్ పళ్ళ ప్యాకింగ్ పెట్టెల కోసం ఏటా ఒక లక్ష చెట్లను కొట్టి వేస్తున్నారు. డార్జిలింగ్ (ప. బెంగాల్)లో 'స్టేట్ ఫారెస్ట్ కార్పొరేషన్' వారు పెద్ద ఆకుల చెట్లను కొట్టివేస్తూ ఉండడంతో మట్టి కోత ఎక్కువై, నదులలో వరదలు ఎక్కువగా వస్తున్నాయి.

---

"ఆత్మరక్షణ కోసం చేసే నేరం న్యాయశాస్త్రం దృష్ట్యా నేరం కాదు." —వి.ఎల్. ఎతిరాజ్

## పశ్చిమ బెంగాల్‌లో బంగారు గనులు:

పశ్చిమ బెంగాల్‌లో పురూలియా సమీపాన గల 'లోవా'లో ఎక్కువ మొత్తంలో బంగారం లభించగల దని కనుగొన్నారు. 1925-26 లోనే ఒక మైనింగ్ ఇంజనీర్ కనుగొన్న ఈ గనులలో కర్ణాటకలో కంటె ఎక్కువ శాతం బంగారం లభిస్తుంది.

* * *

## జాగ్వార్ యుద్ధ విమానాల మీద 'ఎక్సోసెట్' క్షిపణులు:

ఇండియన్ విమాన దళం వారు తమ జాగ్వార్ విమానాల మీద 'ఎక్సోసెట్' క్షిపణులను అమర్చుకునేందుకు ఫ్రెంచ్ ప్రభుత్వం సమ్మతించింది. 52 మొదలు 75 కి.మీ.ల దూరం నుంచి ఈ క్షిపణులను శత్రు యుద్ధ నౌకల పైకి విసిరి, వెంటనే విమానాలు ఆ యుద్ధ నౌకల ఎదురు దాడి పరిధి నుంచి దూరంగా తప్పుకో గలవు.

* * *

## ఢిల్లీలో వ్యాపార నిపుణుల శిక్షణ సంస్థ:

ఇండియన్ ప్రభుత్వం న్యూఢిల్లీలో 'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆంట్రప్రన్యూర్‌షిప్' స్థాపించబోతూంది. ముఖ్యంగా సంఘంలో వెనుక బడ్డ వర్గాల వారికి వివిధ వాణిజ్య నైపుణులలో శిక్షణ ఇచ్చే కార్యక్రమాలను ఈ సంస్థ రూపొందిస్తుంది.

## ఇండియాలో మిక్కిలి పెద్ద ఎరువుల ఫాక్టరీ:

రూ. 900 కోట్ల ఖర్చుతో నిర్మిస్తున్న ఇండియా అంతటిలో మిక్కిలి పెద్ద రసాయనికపు ఎరువుల ఫాక్టరీ 1984 చివర పని చేయడం ప్రారంభిస్తుంది. బొంబాయికి 100 కి.మీ.ల దూరాన ఆలిబాగ్‌లో ఉన్న ఈ ఫాక్టరీలో రోజుకి 4,500 టన్నుల యూరియా ఉత్పత్తి అవుతుంది.

## మిక్కిలి పెద్ద విష సర్పం



ఆగ్నేసియాలోని తెల్ల త్రాచు (King Cobra-రాజ నాగం) విష సర్పా లన్నిటిలో మిక్కిలి పెద్దది. నడి వయస్సులో దీనిపొడవు 18 అ.ల దాకా ఉండవచ్చును. దీని విషం తిరుగు లేనిది. తాయ్‌లండ్‌లోని ఈ పాము కాటు ఒక పెద్ద ఏనుగు ప్రాణం కూడా తీయ గలదు. సాధారణంగా పాము కరచిన ఏనుగు మూడు గంటలలో మరణిస్తుంది.

"ఊరికే వాగకు! రైలును నడిపేది దాని కూత కాదు!" —టి. హారీ థాంప్సన్

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించ బడా లంటే తగిన వివరాలతో సహా రూ. 3 లు మనియార్డరు ద్వారా పంపండి.—సంపాదకుడు.)

1. కందుకూరి శ్రీనివాస్. 19 సం లు, S/o వెంకట నారాయణ, C/o కిరణ్ రిటెయిల్ బ్రాందీ షాప్, కల్యాణ్ ఖని(మంద మర్రి), ఆదిలాబాద్ జిల్లా-504 231.

యోగాసనాలు వేయడం. 'విస్డమ్' చద వడం, అందరితో స్నేహం.

2. చిలవేరి లక్ష్మణ్, 25 సం లు, న్యూ ఫేమస్ టెయిలర్స్. కమ్మర్ పల్లి. నిజామాబాద్ జిల్లా-503 308.

ప్రకృతి ఆరాదన, సంగీతం వినడం, అందరితో స్నేహం.

3. పల్లా రామారావ్, 16 సం.లు. S/o పల్లా సుబ్బారావు, ఇం. నెం. 14-230, ఎ.వి.యస్. లాడ్జి ఎదుట, చీరాల.

పత్రికలు చదవడం, అందరితో స్నేహం.

4. జి. సంజయ్ కుమార్, 14 సం.లు, S/o జి. రవీందర్, ఇం. నెం. 8-74/1, నర్సాపురం - 502 313, మెదక్ జిల్లా.

విజ్ఞానదాయక మైన పుస్తకాలు చదవడం, రేడియో ప్రసారాలు వినడం.

5. బి. సుదర్శన్, 14 సం.లు, 7 వ తరగతి విద్యార్థి, కోటపల్లి పోస్టు, రంగారెడ్డి జిల్లా - 501 106.

వ్యాయామం చేయడం. చదరంగం ఆడడం. పజిల్స్ పూర్తి చేయడం.

## 1983 ప్రపంచ సుందరి



లండన్‌లోని రాయల్ ఆల్బర్ట్ హాల్‌లో ఇటీవల జరిగిన ఎన్నికలో 19 ఏళ్ళ వయస్సు గల మిస్ సారా జేన్ హట్ 1983 ప్రపంచ సుందరిగా ఎన్నికయింది. కొలంబియా సుందరి మిస్ రోసియా లూనా ఫ్లొరెజ్, బ్రెజిల్ సుందరి మిస్ కేటియా సిల్వీరా పెడ్రోసా లు ద్వితీయ, తృతీయ స్థానాలు గెల్చుకున్నారు.

"నా భార్యా బిడ్డలే నా కుటుంబం కాదు:
ఈ మానవజాతి అంతా నా కుటుంబమే!" —జతీంద్రనాథ్ ముఖర్జీ

6. మలిశెట్టి శ్రీనివాసులు, 22 సం లు. శివాలయం వద్ద, ఇం. నెం. 5-159, మహాత్మా గాంధీ రోడ్డు, కదిరి - 515 591, (అనంతపురం జిల్లా).

విజ్ఞానదాయక మైన పుస్తకాలు చదవడం, క్రికెట్ కామెంట్రీ వినడం.

7. వై. రామకిరణ్ రెడ్డి 25 సం.లు. ఇం.నెం. 12, రామ మందిరం వీథి, నార్త్ మోపూరు (నెల్లూరు జిల్లా) - 524 315.

చిత్ర లేఖనం, కరాటే ప్రాక్టీసు చేయడం, గిటార్ వాయించడం.

8. తిత్తి వెంకట శరత్ చంద్ర శేఖర్. 9 సం. లు. 5 వ తరగతి విద్యార్థి, C/o టి వి. బాలకృష్ణ రావు. ఇం. నెం-59, సెంట్ పీటర్స్ సాహూ, జ్ఞానపురం, విశాఖ పట్టణం-530 004.

రేడియో వార్తలు వినడం, ఇంగ్లీష సినీమాలు చూడడం.

9. ఎల్. వెంకట్, బి.ఏ. 23సం.లు, ఇండియన్ నేవల్ షిప్, నిర్ఘాట్, C/o ఫ్లీట్ మెయిల్ ఆఫీసు, విశాఖపట్టణం-530 014.

నాణెముల సేకరణ, కలం స్నేహం, పుస్తకాలు చదవడం.

10. జి. సత్యనారాయణ, S/o గుర్రపు నరసయ్య, క్లాత్ సెంటర్, స్టేషన్ రోడ్డు, మహబూబాబాద్-506 101.

వార్తా పత్రికలు చదవడం, మంచి సినీ మాలు చూడడం.

11. వి. వి. నగేష్, బి.కామ్. ఫైనల్ విద్యార్థి, పెద యిర్లపాడు, ప్రకాశం జిల్లా-523 111.

ఫొటోగ్రఫీ, సినీమాలు చూడడం. పత్రికలు చదవడం.

12. ఎమ్. మధుసూదన రావు, ఇంటర్ మొదటి సం.రం విద్యార్థి, S/o ఎమ్. జేబీ, ఇం.నెం. 11-5-2, వాటర్ టాంక్ వద్ద, ఖమ్మం - 507 002.

షటిల్ ఆడడం. పుస్తక పఠనం, సంగీతం.

13. కె.వెంకటేశ్వర రావు, 17సం.లు,

(మిగతా 31 వ పేజీ)

## ఇండియాలో మిక్కిలి లోతైన ఓడ రేవు



50 ఏళ్ళు నిండిన విశాఖపట్టణం ఓడరేవే ఇండియాలోని రేవులలో మిక్కిలి లోతైంది. 1,00,000 dwt బరువు గల ఓడలు కూడా ఈ రేవులోకి రాగలవు. కన్వేయర్ బెల్ట్ పద్ధతిలో 24 మొదలు 30 గంటలలోగానే సరుకు నింపడం పూర్తి అవుతుంది. ఇక్కడ నీటి మీద తేలే స్వయంచాలక మైన 'భీమ' అనే క్రేన్ 150 టన్నుల బరువును కూడా ఓడ మీది కెక్కించ గలదు.

"ఈ ప్రపంచంలో అన్నీ నశించేవే - భావాలూ, ఆశయాలూ, కలలూ తప్ప!" -సుభాష్ చంద్రబోస్

# ప్రపంచ నగరాలు

## బల్గేరియా రాజధాని: సోఫియా నగరం

పైకి చూడడానికి లండన్, పారిస్ అంత ఆర్భాటంగా కనిపించకపోయినా సోఫియా నగరానికి దాని హుందాతనం దాని కుంది. 6,500 ఏళ్ళ నుంచీ జనం ఈ నగరాన్ని



సోఫియాలోని ప్రాచీన కట్టడాలు

ఎప్పుడూ పాడుపెట్టకుండా ఇక్కడే జీవిస్తూ వచ్చారు. నాటికీ నేటికీ నగర కేంద్రం రవ్వంత కూడా మారలేదు.

క్రీ. పూ. 339లో మాసిడోనియా రాజు ఫిలిప్ ఈ నగరాన్ని జయించాడు. అనంతరం రోమన్ చక్రవర్తి ట్రోజన్ (97-117) ఈ నగరాన్ని అభివృద్ధి చేశాడు. అప్పుడు ఈ నగరం పేరు 'సెర్డికా'. 6 వ శతాబ్దం దాకా ఈ నగరం బైజాంటైన్ సామ్రాజ్యం తాలూకు బలమైన దురాలలో ఒకటిగా ఉండేది. క్రీ.శ. 809 లో ఖాన్ క్రోమ్ ఈ నగరాన్ని బల్గేరియా రాజ్యంలో చేర్చి, దీని పేరును 'స్రెడెట్స్' అని మార్చాడు. 5 వ శతాబ్దంలో ఇక్కడ నిర్మించబడిన సెంట్

## భారతీయులలో మిక్కిలి సంపన్నుడు

ప్రస్తుతం న్యూయార్క్ సమీపంలోని గ్రీనిచ్‌లో నివసిస్తున్న రవి టిక్కూ కు ఉన్నన్ని నూనె ఎగుమతి చేసే 'టాంకర్' నౌకలు ప్రపంచంలో మరెవ్వరికీ లేవు. ఈ నాడు ప్రపంచంలో మిక్కిలి సంపన్నుడైన భారతీయుడు ఆయనే! హిమాచల ప్రదేశ్‌లోని 'మండీ' సంస్థాన ఆర్థిక శాఖామాత్యుని కుమారుడు రవి టిక్కూ. 7 ఏళ్ళ పాటు భారత నౌకా దళంలో పని చేసి, అనంతరం 1964 లో లండన్‌లో 'గ్లోబిక్ టాంకర్స్' అనే సంస్థ స్థాపించాడు. ఒక ధనిక కాశ్మీర్ బ్రాహ్మణ కుటుంబానికి చెందిన రవి ఒక భారతీయుడు కూడా నౌకా సముదాయ యజమాని కాగల దని రుజువు చేయడానికే తాము ఆ సంస్థ స్థాపించా నంటున్నారు.

"కలవారికీ లేనివారికీ మధ్య అఖాతాన్ని పూడ్చకపోతే స్వరాజ్యానికి అర్థం లేదు." —అబుల్ కలాం అజాద్

సోఫియా చర్చి పేరు మీదుగా 1376 లో ఈ నగరానికి 'సోఫియా' అని నామకరణం చేయడం జరిగింది.

బల్గేరియా ఒటోమన్ తుర్కుల నిరంకుశ పాలన నుంచి విముక్తి సాధించిన అనం



సోఫియా సెంట్రల్ మార్కెట్

తరం ఒక ఏడాదికి 1879 ఏప్రిల్ 3 న తమ నూతన రాజ్యానికి రాజధానిగా ప్రజాప్రతినిధి సభ (Great People's Assembly) సోఫియాను ఎన్నుకుంది. స్వాతంత్ర్యం సిద్ధించే నాటికి ఈ నగర జనాభా కేవలం 12,000. 3,306 ఇళ్ళూ, 7 చర్చిలూ, 2 స్కూళ్ళూ, 10 హోటళ్ళూ (inns), 62 పానశాలలూ (taverns), 120 దుకాణాలూ మాత్రమే ఇక్కడ ఉండేవి. ప్రస్తుతం ఈ నగర జనాభా 10 లక్షలు దాటింది. 1,038 ల మేర ఈ నగరం విస్తరించింది. 10 ఏళ్ళ క్రితం ఈ నగరం చుట్టూవేసిన 62 కి.మీ. ల చ.కి.మీ. రింగ్ రోడ్ వెలుపలకు కూడా క్రమంగా నగరం పెరుగుతూంది.

నేడు 'సోఫియా' ఒక గొప్ప పారిశ్రామిక కేంద్రం. మొత్తం బల్గేరియాలో జరిగే ఉత్పత్తిలో 16 శాతం ఇక్కడ ఉన్న 250 పరిశ్రమలలో జరుగుతూంది. పరిశ్రమల వల్ల బల్గేరి


సోఫియా నగరం

యాకువచ్చే మొత్తంఆదాయంలో 20.5 శాతం ఈ నగరంలోని పరిశ్రమలనుంచి వస్తూంది. సోఫియాలోని ఫాక్టరీలు ఇనుము మినహా తక్కిన లోహాల పరికరాలూ, యంత్రాలూ,

## ప్రపంచంలో మిక్కిలి బలశాలి!

టొకోక్కవా (అమెరికా లోని జార్జియా) నివాసి అయిన పాల్ ఆండర్సన్ ప్రపంచం అంతటిలోనూ మిక్కిలి బలశాలి. 5 అ. ల 10 అం ల ఎత్తు గల ఈ వెయిట్ లిఫ్టింగ్ ఛాంపియన్ మణికట్టు చుట్టుకొలత 9 అం. లు. 1957 జూన్ 12 న సీసంతో నింపిన ఒక ఇనప్పెట్టె ఒక బల్లమీద పెట్టి, ఆ బల్ల క్రింద దూరి మూపుమీద ఆ బల్లను పైకి లేవనెత్తాడు. ఆ విధంగా 6,270 పౌన్ల బరువు (2 మోటారు కార్ల బరువు) ను అతడు పైకి లేపాడు!

---

"సృజన వాంఛే శాస్త్ర పరిశోధనకు ప్రధానమైన ప్రేరణ!" —సర్ సి. వి. రామన్

ఎలెక్ట్రానిక్ పరికరాలూ, కంప్యూటర్‌లూ తయారు చేస్తున్నాయి. బల్గేరియా యావాయంలో 16 శాతం సోఫియాలోని పరిశ్రమలవల్ల వస్తుంది.

ఈ నగరంలోని రైల్వేస్టేషన్‌లు రోజూ 135 రైళ్ళను నడుపుతున్నాయి. నగర విమానాశ్రయం నుంచి యూరప్, ఆసియా,



సోఫియాలోని ఒక విశ్వవిద్యాలయం

ఆఫ్రికాలలోని ప్రధాన నగరాలన్నిటికీ విమానయాన సౌకర్యాలు ఉన్నాయి. దగ్గిర, దూరపు రూట్‌లలో మొత్తం 1,000 పైచిలుకు బస్సులు నడుస్తున్నాయి. సిటీ బస్సులు రోజూ 21 లక్షల మంది ప్రయాణీకులను చేరవేస్తున్నాయి.

గత 25 సంవత్సరాల కాలంలో సుమారు 2,03,000 కొత్త ఇళ్ళను ఈ నగరంలో నిర్మించారు. 3 లక్షల మందికి ఇవి వసతి సౌకర్యం కలిగిస్తున్నాయి. 1985 తో పూర్తి కానున్న ప్రస్తుత పంచ వర్ష ప్రణాళికలో మొత్తం 90,000 కొత్త భవనాలనూ, స్కూళ్ళనూ, ఆసుపత్రులనూ నిర్మించాలని నిర్ణయించారు.



పురావస్తు ప్రదర్శనశాల

దేశంలోని రచయితలూ, కళాకారులూ, ప్రతిభాశాలురలో 87 శాతం ఈ నగరంలో

(మిగతా 31వ పేజీలో)

## ముఖచిత్ర వ్యా

(మార్చి 1984)

"ముద్దులొలికే చిరు పాపాయీ!
ముందుముందు అవుతావా సిపాయీ?"
—ఎన్. శ్రీనివాసరావు, హనుమకొండ

* * *

"ఎక్కడికీ పయనం డియర్ బేబీ!
ఎవరికి వేద్దామని ఇప్పటినుండే టోపీ!"
—బాసంగి కిరణ్‌కుమార్, బాసంగి

* * *

"రాబోయే ఒలింపిక్‌లో
కాబోయే సైక్లింగ్ ఛాంపియన్‌ని నేనే!"
—వెంకటరంగ సూరిబాబు, కిర్లంపల్లి

"నీ ప్రధానమైన దుర్గం నీ 'మనస్సు': దాన్ని కోల్పోతే పోరాటంలో ఓటమి తప్పదు!" -రాజాజీ

# టైప్ మెషీన్‌తో చిత్రలేఖనం

రోమియో ఛార్లీ



[కేరళ దేశంలోని కొచ్చిన్‌కు చెందిన రోమియో ఛార్లీ తైవరాంబిల్ ప్రస్తుతం "కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్" వాలూకు మద్రాసులోని 'తరమణి' విభాగంలో పని చేస్తున్నారు. బయటి ప్రపంచానికి ఆయన గురించి ఎక్కువగా తెలియకపోయినా - ఆయన కనిపెట్టిన 'టైప్ మెషీన్‌తో చిత్రలేఖనం' ప్రక్రియ మాత్రం అసాధారణ మైంది.]

ప్రస్తుతం వేరు వేరు కంపెనీలవారు తయారుచేసే టైప్‌రైటర్లు-కొత్త కొత్త సదుపాయాలతో కూడినవి-ఎన్నో నిత్యం మనం చూస్తున్నాం. చిత్రకారుడు తన పెన్సిల్‌ను లేదా బ్రష్‌ను వాడుకున్నట్లు ఈ సదుపాయాలను వాడుక చేసి మనం చిత్రాలు రూపొందించ వచ్చును. టైప్ మెషిన్ ఉపయోగించి అలా చిత్రాలు తయారు చేసే కళను 'టైప్ ఆర్ట్' అనవచ్చును.

చాలా రోజుల క్రిందట ఒక రోజున నేను మా ఆఫీసులో 'హాల్డా' టైప్‌రైటర్ ముందు కూర్చొని ఉండగా ఎదురుగా గోడ మీద అందమైన 'తాజ్ మహల్' చిత్రం

---

## పాఠకుల అభిప్రాయాలు

(మార్చి 1984)

★

"అహంకారం - తనను మాట్లాడ నివ్వదు;
అధికారం - ఎదుటివాడిని మాట్లాడ నివ్వదు;;"

—ఎ.ఎస్.ఎన్. గుప్తా, కొవ్వూరు.

* * *

"ఐరావత మంత తెలివితేటలకన్నా
ఆవగింజంత అదృష్టం గొప్పది;;"

—జి. శ్రీనివాస ప్రసాద్, అనంతపురం.

* * *

"నేతి బీరలోని నేతి పాలెంతో
నేటి నేతలలో నీతిపా లంత;;"

—'శ్రీరామదూత' పి. రాధాకృష్ణమూర్తి, విస్సాకోడేరు.

"అనిశ్చితమైన దాన్ని నమ్మి నిశ్చితమైన
దాన్ని కోల్పోతే - రెండూ నీకు దక్కవు" -సంస్కృతం సామెత

ఒకటి నన్ను విశేషంగా ఆకర్షించింది. వెంటనే టైప్‌రైటర్ లోని కీ'లను ఉపయోగించి ఆ చిత్రాన్ని తయారు చెయ్యడానికి నేను పూనుకున్నాను. కాగితాన్ని అనేక భంగిమలలో మారుస్తూ మొత్తం మీద ఎలాగైతే నేం నేను టైప్ యంత్రంతో 'తాజ్ మహల్' చిత్రం తయారు చేయ గలిగాను.

కున్నాను. మొదటిదీ, అయిదోదీ ఏటవాలుగా ఉండే భాగాలు; తక్కినవి నిటారుగా ఉండేవి. మొదట నిటారుగా ఉండే భాగాలను (2 వ, 3 వ, 4 వ భాగాలను) రిబ్బన్ ఇండికేటర్ సాయంతో పొడవు, వెడల్పులు సమానంగా ఉండేట్టు టైప్ చేశాను. నిటారుగా ఉండే భాగాలు పూర్తి చేసిన తరువాత ఏటవాలు భాగాల చిత్రణకు పూనుకున్నాను.



'టైప్ ఆర్ట్' ద్వారా నేను ఆ తాజ్ మహల్ చిత్రాన్ని ఎలా తయారు చేయ గలిగానో ఇప్పుడు మీకు చెబుతాను. కాగితం మెషీన్‌లోకి ఎక్కించే టప్పుడు ఆ చిత్రం ఎలా తయారు చెయ్యాలో నాకు ఎలాంటి ఆలోచనా లేదు. ఒకటి, రెండు గంటలపాటు మనస్సులో మథనపడిన తరువాత నా కో ఆలోచన స్ఫురించింది. ఆ తాజ్ మహల్ ముఖ దృశ్యాన్ని (front view) ముందుగా నా మనస్సులో 5 భాగాలుగా విభజించు

"నీ వ్యక్తిత్వంలో గుప్తంగా ఉన్న భాగమే నిజమైన నీ స్వభావం!"

—డ్వైట్ ఎల్. మూడీ

## యోచించి చూడు!

విన్న ప్రతి మాటా నమ్మకు!
అనుకున్న ప్రతి పనీ చెయ్యకు!
తెలిసిన సంగతు లన్నీ చెప్పకు!
కంట పడిన ప్రతి వస్తువూ కొనకు!
ఉన్న వన్నీ వాడేసుకోకు!
—అలా చేస్తే నువు ఎప్పుడూ
ఆనందంగా ఉంటావు!

—మార్టిన్ లూథర్

ఆదిలో చాలా తబ్బిబ్బు పడ్డాను. దీనికి ఉపాయం ఏమిటా అని తీవ్రంగా ఆలోచించాను. చివరికి నేను ప్రారంభించిన భూమట్టం నుంచి పైకి 2, 3 స్పేస్‌లు వదిలి 3 పిటారు భాగాలు రెండు వైపులా సమంగా ఉండేట్టు మార్కు చేసుకున్నాను. తరవాత కాగితం మెషీన్‌లో నుంచి బయటికి తీసి, ఆ గుర్తుల ప్రకారం మళ్ళీ మెషీన్‌లో అమర్చి సరళ రేఖలతో వాటిని కలిపాను. పైన డోమ్‌లూ, ప్రక్కన స్తంభాలూ కాక తక్కిన ముఖ దృశ్యం మాత్రం చిత్రించడానికి ఒక రాత్రి అంతా నేను తంటాలు పడ్డాను. మర్నాడు ఆ అసంపూర్ణ చిత్రాన్ని మా ఆఫీసర్ గారికి చూపించాను. పెన్సిల్ ఉపయోగించి వక్ర రేఖలు (curve lines) ఎలా గీయాలో ఆయన నాకు చెప్పారు. సరళ రేఖకు ఒకదాని ప్రక్కన ఒకటిగా 'x' లు నేను కొట్టాను. 3 అం.ల ఎత్తు గల ఆర్చిని నేను ఊహించి దాని నడిమి భాగాన్ని 'x'తో గుర్తించాను. తరువాత పెన్సిల్‌తో ఆర్చి భాగాన్ని కలిపాను. 'బాక్‌స్పేసర్'నూ, రిబ్బన్ ఇండికేటర్‌నూ ఏక కాలంలో ఉపయోగిస్తూ 'H' అక్షరం కొట్టాను. ఆ విధంగా నానా హైరాణా పడి ఇండియా అంతటికీ మిక్కిలి అందమైన తాజ్‌మహల్ చిత్రాన్ని 'టైప్ మెషీన్' మీద తయారు చేయగలిగాను.



'టైప్ ఆర్ట్'లో తరుచు వాడవలసి వచ్చే టైప్ మెషీన్ లోని ప్రధాన భాగాలను మీరు తెలుసుకోడం మంచిది.

1. చిత్రాన్ని బట్టీ, స్వంత ఆలోచనను బట్టీ అందమైన నగిషీ పనికి ఏ ఒక్క అక్షరాన్నైనా మీరు ఎంచుకోవచ్చును.

2. వేరియబుల్ 'లైన్ స్పేసర్'ను ఉపయోగించి లైన్‌ల మధ్య అనవసరమైన స్పేస్ రాకుండా చూసుకోవచ్చును.

3. 'బాక్ స్పేసర్' కూడా 'టైప్ ఆర్ట్'లో ప్రధాన పాత్ర నిర్వహిస్తుంది. చిత్రంలో వక్ర రేఖ ఉన్నప్పుడు లేదా సరియైన స్థానంలో అక్షరం కొట్టవలసి వచ్చినప్పుడు మాత్రమే 'బాక్‌స్పేసరు'ను వాడాలి.

4. చిత్రంలో ఒక భాగాన్ని చిత్రించడానికి పూనుకునే ముందు రిబ్బన్ ఇండికేటర్‌ను 'స్టెన్సిల్' స్థానంలో ఉంచి అక్షరాలు కొట్టి చూడాలి. అది సరిగానే ఉన్నదని

## 'లంచ్' సమయంలో 80 కోట్ల డాలర్ల ఇన్సూరెన్స్ వ్యాపారం

ఎల్మర్ లెటర్‌మాన్ అనే ఇన్సూరెన్స్ ఏజెంట్ న్యూయార్క్‌లో మిక్కిలి ఖరీదైన రెస్టారెంట్‌లో లంచ్ చేసేవాడు. అక్కడ రిజర్వేషన్‌కే 6,500 డాలర్లు చెల్లించాలి. అయితే ఏం? ఆ 'లంచ్' సమయంలో తేలిగ్గా అతడు సుమారు 80 కోట్ల డాలర్ల బిజినెస్ చేసేవాడు!

"తప్పు చెయ్యడం కంటె వాయిదా వెయ్యడం మంచిది!" —థామస్ జెఫర్‌సన్



తో స్తే అప్పుడు రిబ్బన్‌ను 'బ్లాక్'లోకి మార్చుకోవచ్చును.

టైప్ చెయ్యడంలో సిద్ధహస్తుడు కావడం వల్ల ఏ వ్యక్తీ గొప్ప టైప్ ఆర్టిస్ట్ కాలేడు. తన చిత్రానికి అనుగుణమైన టైప్‌రైటర్‌ను ఎంచుకోడం. కీ బోర్డ్‌ను చిత్ర చిత్రాలుగా వాడుకోడం 'టైప్ ఆర్ట్'లో చాలా ముఖ్యం. 'టైప్ ఆర్ట్'కి పూనుకునే వ్యక్తికి అన్నిటి కంటె ముఖ్యంగా కావలసినది ఓర్పూ, భావనాశక్తీ!

(24 వ పేజీ తరువాయి)

ఇంటర్ రెండవ సం. రం విద్యార్థి, S/O కె. హనుమంతరావు, ఎ ఇ, C/o డా॥ ఎస్. బాబ్జీ, ఆర్. ఎమ్. పి. నిజాంపేట, ఖమ్మం-507 001.

బ్యాడ్‌మింటన్ ఆడడం, పుస్తక పఠనం, సంగీతం.

14. ఎన్. శ్రీనివాస రావు, 19 సం.లు. బి.కామ్. రెండవ సంవత్సరం విద్యార్థి: యాకుబ్ గార్డెన్ స్ట్రీట్, పెరంబూర్ బారక్స్, మద్రాసు-600 012.

జోక్స్ వేయడం. పుస్తకాలు చదవడం.

15. బి గోపాలకృష్ణమూర్తి, ఎం.ఏ, (ఎం.కామ్). 24 సం.లు. మేనేజింగ్ డైరెక్టర్; సెంటర్ ఫర్ కామర్స్ స్టడీస్, 16-4-34 (మేడ పైన), చర్చ్ స్ట్రీట్, చిత్తూరు-517 001.

నిజమైన స్నేహం. సంఘసేవ.

(27 వ పేజీ తరువాయి)

జీవిస్తున్నారు. శాస్త్రవేత్తలలో 16 శాతం ఇక్కడ ఉన్నారు. మొత్తం 5,500 మంది లెక్చరర్లతోనూ, 60,000 మంది విద్యార్థులతోనూ కూడిన 12 విశ్వ విద్యాలయాలు ఇక్కడ ఉన్నాయి.

సోఫియాలో చెప్పుకోదగిన మిక్కిలి దర్శనీయమైన కట్టడం 1259 లో నిర్మించబడిన 'బోయన్ చర్చ్'. అద్భుతమైన కళా వైభవంతో కూడిన ఈ భవనం బల్గేరియన్ కళా ప్రాభవాన్ని వేనోళ్ళ చాటుతూంది.

ఈ నగర చిహ్నం (emblem) మీద కనిపించే లక్ష్యం "ముసలితనం పైబడని పెరుగుదల!" అని. ఇక్కడి భవనాలూ, ఆధునిక దుకాణాలూ, విశాలమైన స్కూళ్ళూ, కాలేజీలూ, అందమైన పార్కులూ-అన్నీ ఆ లక్ష్యం పూర్తిగా సాధించబడిందనడానికి ప్రత్యక్ష నిదర్శనాలు!

"విసుగు పుట్టించడం కంటె
సంగ్రహంగా చెప్పడం ఉత్తమం! —షేక్స్పియర్

# ప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## బట ఐ స్టై

మోనీ బాగ్చీ

జీవిత కాలంలోనే 'పురాణ పురుషుడు'గా మారిన ఐన్‌స్టైన్ మానవ జాతి భావ వికాస చరిత్రలో ఒక మైలురాయి వంటివారు. మాట



లతో కాకుండా చేతలతో తన జీవిత కథ వ్రాసి, కేవలం స్మృతుల కంటె గణనీయమైన వారసత్వాన్ని మానవ జాతికి ఆయన వదలి వెళ్ళారు. ఆయన ప్రముఖ శాస్త్రజ్ఞుడు అనే మాట నిజమే గాని, అంతకంటె నిజంగా ఆయన గొప్పదనం ఆయన శాంతి కాముకతలోనూ, విశ్వ సౌభ్రాత్ర భావనలోనూ ఉంది. ఐన్‌స్టైన్ సాధించిన ఘనవిజయాలూ, మానవ జగత్తు మీద ఆయన ప్రసరింప జేసిన ప్రభావం మాటలకు అందనివి.

ఐన్‌స్టైన్ ఆవిష్కరించిన 'సాపేక్షతా సిద్ధాంతాన్ని' భౌతిక శాస్త్రవేత్తలు పరమ ప్రామాణిక సిద్ధాంతంగా శిరసావహిస్తున్నారు. గెలీలియో, న్యూటన్‌ల తరువాత ఐన్‌స్టైన్ అంత గొప్ప శాస్త్రజ్ఞుడు మరి పుట్టలేదంటున్నారు. ఐన్‌స్టైన్ వ్యక్తిత్వాన్ని నిశితంగా

---

### జీవితం ఒక ప్రయోగ శాల

"పిరికితనం, ప్రతిదానికీ తలక్రిందులైపోవడం మానెయ్యి! ఎన్నిసార్లు ప్రయోగాలు చేస్తే అంత మంచిది. అవి కొంచెం మొరటుగా ఉండి నీ కోటు దుమ్ము కొట్టుకు పోవడమో, చిరుగడమో జరిగినా ఫరవాలేదు. ఓడిపోయి, ఒకటి రెండు సార్లు క్రింద పడి పొర్లాడడం జరిగినా లక్ష్యం చెయ్యకు. మళ్ళీ లే! నీ ప్రయోగం కొనసాగించు—ఈ సారి పతనం అంటే నీకు భయం ఉండదు!"

—ఆర్. డబ్ల్యు. ఎమర్సన్

"కలలు నిజం చేసుకోడానికి ఉత్తమమైన మార్గం: మేలుకోడం!"

గమనిస్తే ప్రధానంగా ఆయన గొప్ప 'భావుకుడు' (thinker) అనీ, ఆ తరువాతనే ఆయన 'శాస్త్రవేత్త' అనీ స్పష్టం అవుతుంది. ఎడ్డింగ్టన్ అన్నట్టు – ఆ కారణం వల్లనే ఆధునిక మానవ చరిత్రను ఆయన ఒక పెద్ద మలుపు త్రిప్పగలిగారు. అతి సంకీర్ణమైన ఐన్‌స్టైన్ ఆలోచనల గూడు మానవ జాతి జీవన విధానాన్నే మూలముట్టుగా మార్చివేసింది.

1879 మార్చి 14న దక్షిణ జర్మనీలోని 'ఉల్మ్' నగరంలో ఐన్‌స్టైన్ జన్మించారు. తల్లిదండ్రులు జన్మతః యూదులైనా, ఏ ప్రత్యేక మతాన్నీ పట్టుదలగా అనుసరించిన వారు కారు. ఆయన పుట్టిన ఒక ఏడాదికి ఆ కుటుంబం మ్యూనిచ్ నగర పరిసరాలలోకి తరలింది. ఐన్‌స్టైన్ తండ్రికి ఒక చిన్న 'ఎలెక్ట్రో - కెమికల్' ఫాక్టరీ ఉండేది. చాక చక్యంతో కుటుంబాన్నంతా దిద్దుకొని వచ్చే ఆయన తల్లికి సంగీతం అంటే చాలా ఇష్టం. ఆమె ప్రోద్బలం వల్లనే 6 వ ఏటనే ఐన్‌స్టైన్ సంగీత పాఠాలు నేర్చుకోడం మొదలు పెట్టాడు. మొదట్లో ఆ పాఠాలు కొంత తల నొప్పిగానే ఉన్నా, క్రమంగా సంగీతంలో ఆయనకు అభిరుచి కలిగింది. ముఖ్యంగా ఆస్ట్రియన్ వాగ్గేయకారుడు మోజార్ట్ (1756-91) వ్రాసిన హృదయం ద్రవింపజేసే 'సనాట' కృతులు వాయించడం అంటే ఆయన కెంతో ఇష్టం. జీవితాంతం ఆయన 'వయొలిన్' వాద్యాన్ని వదలి పెట్టలేదు. యూరప్, అమెరికా ఖండాలు రెంటిలో ఆయన వయొలిన్ వాద్య ప్రతిభ ప్రశంస లందుకుంది.

ఐన్‌స్టైన్ చిన్నతనం ఎక్కువ భాగం మ్యూనిచ్‌లోనే గడిచింది. అక్కడే ఆయన ప్రాథమిక విద్య అభ్యసించారు. 15 వ ఏటనే యూక్లిడ్, న్యూటన్, స్పినోజాల రచనలను

---

## ప్రతి 100 మందికి 164.8 టెలిఫోన్‌లు



అమెరికా మొత్తం మీద ప్రతి 100 మందికి 57 టెలిఫోన్‌లు ఉండగా, ఆ దేశం రాజధాని నగరం వాషింగ్టన్‌లో ప్రతి 100 మందికి 164.8 టెలిఫోన్‌లు ఉన్నాయి. ఇతర ప్రపంచ రాజధాని నగరాలలోని ఫోన్‌ల వివరాలు:

| | ప్రతి 100 మందికి |
|---|---|
| స్టాక్ హూమ్ (స్వీడెన్) | 124 |
| పారిస్ (ఫ్రాన్స్) | 121.9 |
| మాస్కో (రష్యా) | 84.1 |
| లండన్ (ఇంగ్లండు) | 79 |

---

"సాహసం వల్ల 'పౌరుషం', వెనుకంజ వెయ్యడం వల్ల 'భయం' పెరుగుతాయి!" —ప్యూబ్లియస్ సైరస్

ఆయన ఆపోశన పట్టారు. తన చిన్నతనంలో జరిగిన రెండు ప్రధాన సంఘటనలలో ఒకటి; అయస్కాంతపు కాంపస్ నొకదానిని తన 5 వ ఏట ఎవరో తనకు కానుకగా ఇవ్వడం. రెండు: తన 15 వ ఏట తాను యూకిడ్ జియోమెట్రి అధ్యయనం చెయ్యడం - అని ఐన్‌స్టైన్ పేర్కొన్నారు. 'జిమ్నాసియమ్'లో విద్యార్థిగా ఉండగా గణిత శాస్త్రంలో ఆయన గొప్ప ప్రతిభ ప్రదర్శించారు కాని తక్కిన సబ్జక్టులు అంతగా ఆయనకు వంట బట్టేవి కావు.

17 వ ఏట స్విట్జర్లండ్‌లోని జూరిచ్ పోలీటెక్నికల్ స్కూల్‌లో చదువుతూ ఉండగా విజ్ఞాన శాస్త్రం అంతు చూడా లని ఆయన నిర్ణయించుకున్నారు. జూరిచ్ విశ్వ విద్యాలయంలో ఒక ప్రక్క చదువుతూనే మరో ప్రక్క అక్కడి హైస్కూల్లో పాఠాలు చెప్పేవారు. 22 వ ఏట స్విట్జర్లండ్ పౌర స్వతం పొంది, తన మాజీ సహ విద్యార్థినిని వివాహ మాడి, జీవనోపాధి కోసం బెర్నిలోని పేటెంట్‌ల ఆఫీసులో కొంత కాలం పని చేశారు.

ఐన్‌స్టైన్ జీవితంలో 1905 చిరస్మరణీయ మైన సంవత్సరం. ఆ ఏడాదే ఆయన 'అన్నా లెన్ డెర్ ఫిజిక్స్' (Annals of Physics_ భౌతిక శాస్త్ర వికాసం) అనే పత్రికలో "కదిలే వస్తువుల తాలూకు వైద్యుత చలన సూత్రా లను గురించి" (On the electro dynamics of moving bodies' అనే వినమ్ర మైన శీర్షికతో ఒక్క వ్యాసం ప్రకటించారు. పదార్థాన్ని (matter) గురించీ, విశ్వ రచ నను గురించీ అంతకు ముందున్న భావనల నన్నిటినీ అది తారుమారు చేసింది. ఆ వ్యాసంలో ఆయన ప్రతిపాదించిన సాపేక్షతా సిద్ధాంతం. దాని పర్యవసానాలూ ఆ నాడు చాలా కొద్ది మందికే బోధపడ్డాయి. కాని, 40 ఏళ్ళ అనంతరం ఒక అమెరికన్ యుద్ధ విమా నం హిరోషిమా మీద ఆటంబాంబును వదలి

## మంచి పని వాడి లక్షణాలు



తను చేసే పని అతనికి క్షుణ్ణంగా తెలుసు.
ఇచ్చిన సూచనలను తు చ. తప్పకుండా పాటిస్తాడు.
తోటి పని వారు అతణ్ణి గౌరవిస్తారు.
సరియైన నిర్ణయాలు తీసుకుంటాడు.
మార్పులకు అనుగుణంగా మారుతాడు.
సరదాగా ఉంటాడు - తొందర పడడు:
స్వంత పని అన్నంత శ్రద్ధగా ఏ పని అయినా అతడు చేసాడు::

"స్వధర్మే నిధనం శ్రేయః, పర ధర్మో భయావహః"
(ఎవరి ధర్మం వారు ఆచరించడమే సర్వోత్తమం!) - భగవద్గీత

నప్పుడు (1945 అగస్టు 6 న) ఆ సిద్ధాంతాన్ని ఉపయోగించడం వల్లనే 80 వేల మంది జనం హతులు కావడం జరిగింది.

ఐన్‌స్టైన్ ప్రతిపాదించిన సాధారణ, విశిష్ట సాపేక్షతా సిద్ధాంతాలే ఏ ఇతర శాస్త్రజ్ఞుని రచనల కంటే కూడా విజ్ఞాన శాస్త్రంలో గొప్ప విప్లవం తెచ్చినప్పటికీ, ఆయన సంతృప్తి చెందక విశ్వ రచనను కచ్చితంగా వర్ణించేందుకు కృషి సాగిస్తూ వచ్చారు. 1921 లో అంతకు పూర్వం 'రేడియన్ ఎనర్జీ'కి సంబంధించిన సిద్ధాంతాలలో ఐన్‌స్టైన్ ప్రతిపాదించిన మార్పులకూ, మాక్స్ ప్లాంక్ చెప్పిన క్వాంటమ్ సూత్రాన్ని 'రేడియన్ట్ ఎనర్జీ'కి కూడా విస్తరింప జేసినందుకూ ఆయనకు నోబెల్ బహుమతి లభించింది. ఆ బహుమతి క్రింద ఆయనకు వచ్చిన ధనం అంతా దానధర్మాల క్రిందనే ఆయన ఖర్చుపెట్టారు. 1906 మొదలు 1920 వరకూ ఐన్‌స్టెన్ చేసిన పరిశోధన ఫలితంగా వెలసిన సూత్రాలలో 'ఐన్‌స్టైన్ ఫోటో ఎలెక్ట్రిక్ లా' ఒకటి. 'స్పెక్ట్రోస్కోపీ'లో అది గొప్ప మార్పు తెచ్చి అనంతరం టెలివిజన్ కనుగొనడానికి దారి తీసింది.

బెర్లిన్ యూనివర్సిటీలో కొన్నాళ్ళు ప్రొఫెసర్‌గా ఆయన పని చేశారు. అయితే_అదృష్ట వశాత్తు 1933 లో హిట్లర్ అధికారంలోకి వచ్చిన సమయంలో ఆయన ఇంగ్లండ్, అమెరికాలలో లెక్చరు టూర్ మీద ఉన్నారు. నాజీలు ఆయన ఆస్తి అంతా స్వాధీనం చేసుకున్నారు. యూనివర్సిటీ ప్రొఫెసర్ పదవినీ, ఆయనకు బహూకరింపబడిన 'జర్మన్ రిపబ్లిక్ గౌరవ పౌరసత్వాన్నీ' వారు రద్దు చేశారు. ఆ తరువాత ఆయన అమెరికాలోని న్యూజెర్సీలో ప్రిన్స్‌టన్‌లో 'న్యూ ఇన్‌స్టిట్యూట్ ఫర్ అడ్వాన్స్‌డ్ స్టడీస్' తాలూకు 'స్కూల్ ఆఫ్ మేథమెటిక్స్' డైరెక్టర్ అయారు.

## టెలిఫోన్ కనిపెట్టింది ఎవరు?



ప్రజోపయోగకరంగా టెలిఫోన్‌ను రూపొందించిన మొదటి వ్యక్తి బోస్టన్ (అమెరికా)లో స్వరపేటికకు సంబంధించిన శరీరశాస్త్రం ప్రొఫెసరూ, బెల్ టెలిఫోన్ కంపెనీ స్థాపకుడూ అయిన అలెగ్జాండర్ గ్రాహం బెల్. అయితే ఒక బ్యాటరీతోనూ, ట్రాన్స్‌మిటర్‌తోనూ పనిచేసిన ఆయన టెలిఫోన్ 30 కి.మీ.ల దూరం మాత్రమే వినిపించేది.

నిజంగా ఈ నాడు ఉపయోగించే టెలిఫోన్‌ను కనిపెట్టినవాడు ఫ్రీడ్రిఖ్స్‌డోర్ఫ్ (జర్మనీ)లో ఫిజిక్స్ టీచర్ ఫిలిప్ రైస్. ఆ టెలిఫోన్‌ను రూపొందించిన వాడు అడాల్ఫ్ స్టోల్‌ట్జి.

"మోసగాణ్ణి మోసగించడం రెండింతల ఆనందాన్నిస్తుంది." —లా ఫాంటేన్

1940 లో అమెరికన్ పౌరసత్వం పొంది జీవిత శేషం ప్రిన్స్టన్‌లోనే గడిపారు. 75 ఏళ్ళు నిండే దాకా ప్రపంచం అంతటా ఆయన నివాళు లందుకున్నారు. తన 76 వ ఏట విశ్వ రచనకు సంబంధించిన సూత్రాలను మరింత సరళం చేయాలనే కృషి సాగిస్తూనే ఆయన తుదిసారి కన్ను మూశారు.

ఒక గొప్ప భౌతికశాస్త్ర సిద్ధాంతిగానే కాక ఒక గొప్ప దార్శనికుడుగా కూడా ఐన్‌స్టైన్ ప్రసిద్ధి పొందారు. 1931 లో బెర్లిన్‌లో ఐన్‌స్టైన్‌ని కలుసు కొన్నప్పుడు టాగూరు ఆయనను ఒక ప్రశ్న అడిగారు: "మన చైతన్య నిరపేక్షంగా, వాస్తవికంగా బాహ్య జగత్తు ఉందా, లేదా?" అని. "ఉందనే నమ్మకం నాకు ఉంది. మతం సాయం లేని సైన్సు కుంటిది అనీ, సైన్సు కళ్ళు లేని మతం గుడ్డిది అనీ నేను నమ్ముతున్నాను" అన్నారు ఐన్‌స్టైన్.

జీవితం అంతా నక్షత్రాల కేసి చూస్తూనే ఐన్‌స్టైన్ గడప లేదు. తోటి మానవుల పట్ల ప్రగాఢమైన కరుణ ఆయన ప్రకటించారు. అదే ఆయనలోని విశిష్టత! శతాబ్దాలు గడిచినా మానవుడుగా ఐన్‌స్టైన్ ఘనతను మరచి పోవడం కష్టం. కలకాలం మానవజాతికి ఒక ధ్రువతారగా ఆయన నిలుస్తారు. ఒక ఉదాత్తమేధ సాధించిన విజయాలు మన్నించబడుతూ ఉన్నంత కాలం శాస్త్రవేత్తలు ఈ ప్రపంచంలో ఆయనను ఆరాధిస్తూనే ఉంటారు.

## గట్టిగా గాలి వీస్తే కూలిపోయిన బ్రిడ్జి

ప్రపంచంలో మిక్కిలి పొడవైన 'సస్పెన్షన్' బ్రిడ్జిలలో మూడోది అయిన టకోమా వద్ద 'నేరోస్' జలసంధి కడ్డంగా కట్టిన 2,800 అ. ల పొడవు గల బ్రిడ్జికి 1940 లో ప్రారంభోత్సవం జరిగింది. కాని, ఆ తరువాత 4 నెలలకే గంటకు 42 కి.మీ. ల వేగంతో వీచిన గాలి విసురుకు తట్టుకోలేక అది నీళ్ళలో కూలిపోయింది!

## ఎప్పుడూ నీళ్ళు త్రాగని జంతువు



ఆస్ట్రేలియాలోని 'కోలా' అనే ఒక చిన్న జంతువు జీవితంలో ఒక్కసారి కూడా నీరు త్రాగదు. యూకలిప్టస్ చెట్ల ఆకులు దాని ఆహారం. సాధారణంగా ఆ చెట్లమీదే రుచికరమైన వాటి ఆకులు మేస్తూ అది కనిపిస్తుంది.

"కోప పడలేని వాడు మూర్ఖుడు!
కోప పడని వాడు ఉత్తముడు!"

# వింతలు విశేషాలు

## చక్కెర కన్న 180 రెట్లు తియ్యని పదార్థం:

చక్కెర కంటె 180 రెట్లు తియ్యగా ఉంటూ, అయినా కేలరీల శక్తి తక్కువగా ఉండే 'అస్పర్టేమ్' అనే పదార్థాన్ని అమెరికాలో ఇప్పుడు 'కార్బొనేటెడ్' పానీయాలలో ఎక్కువగా వాడుక చేస్తున్నారు.

* * *

## విడాకులకు దారితీసిన స్టాంపుల సేకరణ:

రోటర్‌డామ్ (హాలండ్)లోని లియోన్ వాన్‌గ్రిస్‌కు స్టాంపుల సేకరణ అంటే సరదా! నిరంతరం అతడు ఆ పిచ్చిలో పడి భార్య సంగతి పట్టించుకునేవాడు కాదు. చివరకు ప్రాణం విసిగి ఆమె ఆతని స్టాంపులన్నిటికీ అగ్గిపుల్ల గీసి అంటించి, అతనికి విడాకు లిచ్చి వెళ్ళిపోయింది.

## °, విద్యుచ్ఛక్తి తోనూ పనిచేసే 'హాట్ ప్లేటు':

గుజరాత్‌లోని ఒక సంస్థ కిరోసిన్‌తోనూ, విద్యుచ్ఛక్తితోనూ పని చేసే కొత్త రకం 'హాట్‌ప్లేట్' (ఎలెక్ట్రిక్ పొయ్యి) తయారు చేసింది. దీనివల్ల ఇంధనం ఖర్చు 75 శాతం తగ్గుతుంది. తగిన రక్షణ ఏర్పాట్లన్నీ దీనిలో ఉన్నాయి. దీనిలో 'ప్రెషర్ టాంక్' లేదు.

## ఏనుగు తుండంలో 40,000 కండరాలు



ఏనుగు రోజూ 18 గంటల సేపు మేత మేస్తుంది. పెద్దసైజు ఏనుగుకు రోజుకు 100 పౌన్ల గడ్డి, బోలెడు పళ్లూ, కూరలూ కావాలి!

ఏనుగుకు తుండం బహుళార్థ సాధకమైన అవయవం. శ్వాసించడానికీ, నీరు త్రాగడానికీ కాక బలమైన ఆయుధంగా కూడా అది తన తుండాన్ని ఉపయోగిస్తుంది. ఏనుగు తుండంలో 40,000 విడి కండరాలు – అంటే ఇంచు మించు మనిషి శరీరం అంతటిలోనూ ఉన్నన్ని కండరాలు ఉంటాయి. తుండం చురుకుగానూ, బలంగానూ పని చెయ్యడానికి ఇవే కారణం!

"ఆగ్రహం తాత్కాలిక ఉన్మాదం!" ——హోరేస్

మంట మండేటప్పుడు 'కార్బన్ మోనాక్సైడ్' (—సి) ఏర్పడదు.

* * *

## ఒరిస్సాలో డిజిటల్ ఎలెక్ట్రానిక్ వాచ్‌ల ఉత్పత్తి:

ఒరిస్సాలో మొట్టమొదటి డిజిటల్ ఎలెక్ట్రానిక్ వాచ్ ఫాక్టరీని రూ. 73.30 లక్షల పెట్టుబడితో 'చండక' ఇండస్ట్రియల్ కాంప్లెక్స్‌లో ఏర్పాటు చేస్తున్నారు. ఏటా 2.5 లక్షల గడియారాలు అక్కడ తయారవుతాయి. 'మోడ్యూల్' బేటరీలు, కేస్‌లు మొదలైన విడి భాగాలను జపాన్ నుంచి దిగుమతి చేసుకుని ఇక్కడ వాటిని అసెంబుల్ చేస్తారు.

* * *

## చిత్తూరులో గనుల తవ్వకం పరికరాల ఫాక్టరీ:

ఆంధ్రప్రదేశ్‌లోని వెనుకబడిన జిల్లాల్లో ఒకటి అయిన చిత్తూరులో రూ. 8 కోట్ల ఖర్చుతో గనుల తవ్వకం పరికరాల ఫాక్టరీని స్థాపిస్తున్నారు. ముఖ్యంగా నూనె బావుల త్రవ్వకానికి అవసరం అయిన పరికరాలను ఇక్కడ ఉత్పత్తి చేస్తారు.

* * *

## ఉక్కు ఉత్పాదనలో ఇండియాకు రష్యా సహాయం:

రష్యా సహాయంతో ఇండియాలో వెలసిన పరిశ్రమలలో ఇప్పటికి 5.5 కోట్ల టన్నుల ఉక్కు, 640 టన్నుల వివిధ సాధన సామగ్రి, 5.7 కోట్ల టన్నుల నూనె, 6 కోట్ల టన్నుల నూనె నుంచి వచ్చే సరుకులు ఉత్పత్తి అయ్యాయి.

* * *

## యుగోస్లావియాలో తొలి ఇంగ్లిష్ దినపత్రిక:

'న్యూస్ డే' అనే ఒకే ఒక ఇంగ్లీష్ దినపత్రిక యుగోస్లావియాలో 1983 జూన్ 6 నుంచి వెలువడుతూంది.

---

## గ్రామాలలో మంచి నీటి ఎద్దడి




మన పల్లెలలోని దాదాపు 16.3 కోట్ల మంది పిల్లలకు శుభ్రపరచిన మంచి నీరు లభించడం లేదు. 1,13,000 గ్రామాలలో 1.6 కి.మీ.ల కంటె ఎక్కువ దూరం నుంచి నీళ్ళు తెచ్చుకోవాలి. అది కూడా కలరా వంటి వ్యాధులను కలిగించే అపరిశుభ్రమైన నీరు. 2,14,000 గ్రామాలలో ఏర్లు, చెరువులు, బావుల నుంచి చాలినంత నీరు లభించడం లేదు. అపరిశుభ్రమైన నీరు - అదీ చాలీ చాలకుండా - లభిస్తున్న పల్లెలు కనీసం 1,85,000 దాకా ఉన్నాయి.

"మేలుకొన్న వారికే 'ఉషోదయం' అవుతుంది." —ఆగ్నెస్ గ్విల్ ఫోయిల్

# నిజాలు-నిదర్శనాలు

## ఇండియన్ ఎయిర్ లైన్స్ విశిష్టత:

చేరవేసే ప్రయాణికుల సంఖ్య దృష్ట్యా, ఎగిరే కిలోమీటర్ల దృష్ట్యా ఆసియాలోనూ, మధ్య ప్రాచ్యంలోనూ ఉన్న విమాన సర్వీస్ లలో ఇండియన్ ఎయిర్ లైన్స్ మూడో స్థానంలోకి వచ్చింది.

## రైలు ప్రమాదాలకు కారణాలు:

1981-82వ సం. రంలో ఇండియాలో 1130 రైలు ప్రమాదాలు సంభవించాయి. వీటిలో 76 శాతానికి కారణం మనుష్యుల అజాగ్రత్తే! 15 శాతం రైల్వే పరికరాలలో లోపంవల్లా, 8 శాతం అనుకోకుండా జరిగే సంఘటనల వల్లా, 1 శాతం విద్రోహచర్యల ఫలితంగానూ సంభవించాయి. ఈ ప్రమాదాల వల్ల రూ. 1.29 కోట్ల ఆస్తి నష్టం అయింది.

* * *

## బ్రిటన్‌లో 3 లక్షల అవివాహితలు:

పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల్లో ముసలివారి ఉపచారాలు 70 శాతం వరకూ

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద తపాలా వ్యవస్థ





మన దేశంలో ఎక్కువ మందికి ఉపాధి కల్పిస్తున్న సంస్థలలో మన తపాలా వ్యవస్థ ఒకటి. ప్రపంచం అంతటిలో మిక్కిలి పెద్ద తపాలా వ్యవస్థ ఇది. ఏటేటా 15 కోట్ల మనియార్డర్లూ, 12 కోట్ల రిజిష్టర్డ్ ఉత్తరాలూ ఈ సంస్థ ద్వారా బట్వాడా అవుతున్నాయి. 1947 లో స్వరాజ్యం వచ్చేనాటికి దేశం మొత్తం మీద 80,000 టెలిఫోన్‌లు మాత్రమే ఉండగా, ఈ నాడు ఒక్క బొంబాయి నగరంలోనే 5 లక్షల టెలిఫోన్‌లు ఉన్నాయి. 1947 లో 600 టెలిఫోన్ ఛానల్స్ మాత్రమే ఉంటే, ఇప్పుడు 71,000 ఛానల్స్ పని చేస్తున్నాయి.

"పూర్వుల ఘనత తప్ప గర్వించే దేదీ లేనివాడు బంగాళాదుంప లాంటివాడు: దానికి సారవంతమైన భాగం నేల అడుగునే ఉంటుంది." —ఓ. వెర్ బరీ

వారి భార్యలూ, కుమార్తెలే చేస్తున్నారు. వృద్ధాప్యంలో తల్లిదండ్రులను చూడడం కోసం బ్రిటన్‌లో 3 లక్షల మంది స్త్రీలు అవివాహితలుగా ఉండిపోయారు.

* * *

## ఇండియాలో నల్ల ధనం:

1964 నాటికి ప్రభుత్వపు లెక్కలలో చేరని నల్ల ధనం ఇండియాలో రూ. 3,400 కోట్లు అని అంచనా; ఆ ఏడు చలామణీలో ఉన్న కరెన్సీ కంటె అది రూ. 800 కోట్లు ఎక్కువ. 1981 లో ఈ ధనాన్ని రూ. 7,500 కోట్లు (జాతీయాదాయంలో 6.8 శాతం) మొదలు రూ. 25,000 (జాతీయాదాయంలో 22.7 శాతం) వరకూ పలు విధాలుగా అంచనాలు వేశారు.

* * *

## విడాకులలో డెన్మార్క్, బ్రిటన్‌ల ముందంజ:

డెన్మార్క్ (యూరప్) లో పుట్టే ప్రతి 1,000 మంది శిశువులలో 375.5 మంది అంటే 36 శాతం అక్రమ సంతానం; డెన్మార్క్ లోనూ, బ్రిటన్ లోనూ 1,000 మంది జనాభాలో విడాకులు తీసుకున్న వారు 2 8 మంది. 1,000 మందిలో విడాకులు తీసుకున్న వారు ఇద్దరు ఉన్న హాలండ్‌ది ఆ విషయంలో ద్వితీయ స్థానం. ఐర్లండ్‌లో అసలు విడాకులే లేవు.

## సైకిళ్ల మీద భారత యాత్ర

ముగ్గురు ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులు - శ్రీధర రెడ్డి, గోవర్ధన్ కృష్ణ, ప్రేమ్‌రాజ్ అనే వారు — ఇటీవల కాశ్మీర్ నుంచి కన్యాకుమారి దాకా సైకిళ్ళమీద విజయవంతంగా తమ యాత్ర ముగించారు. 135 రోజులలో 5,500 కి.మీ.ల దూరం వారు ప్రయాణించారు. దారిలో ఆదివాసుల గూడేలూ, మారుమూల గ్రామాలూ ఎన్నో వారికి తగిలాయి.

## సూర్యకాంతి నుంచి నేరుగా విద్యుచ్ఛక్తి



ఎలెక్ట్రానిక్స్‌లో సాధించిన అభివృద్ధి ఫలితంగా మ్యూనిఖ్ (ప. జర్మనీ) లోని ఒక కప్పు మీద - యూరప్ ఖండం మంతటిలో మొట్ట మొదటి సారిగా - సూర్య కాంతిని నేరుగా విద్యుచ్ఛక్తిగా మారుస్తున్నారు. ఈ యంత్రంలో ఒక ఎలెక్ట్రానిక్ పరికరం విద్యుచ్ఛక్తి మెయిన్‌లలోని వోల్టేజ్‌లో మార్పులను సెకనుకి 5 లక్షల సార్లు కొలిచి చెబుతుంది. మ్యూనిఖ్‌లో నెలకొల్పిన ఈ యంత్రం సంవత్సరానికి 5,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని సమకూరుస్తుంది.

“మన అభివృద్ధికి బద్ధ విరోధి: ‘అసహనం!’” —డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 30

## దూర, సామీప్య చిత్రణ



రేఖలలో: నిలువు రేఖలూ, అడ్డు రేఖలూ తప్ప తక్కిన రేఖ లన్నీ ప్రకృతిలో వాలి ఉన్నట్టే కనిపిస్తాయి. సమాంతర రేఖలు దూరాన ఎక్కడో అవి కలియబోతున్న బిందువు వైపుకి వాలి ఉన్నట్టు తోస్తాయి. రైలు పట్టాల మధ్య నుంచుని జాగ్రత్తగా వాటిని పరిశీలించండి. నిజానికి నేల మీద అవి సమాంతరంగానే సూటిగానే ఉన్నా, కంటికి దూరంగా తాము కలియబోయే బిందువు వైపు

## మిక్కిలి పెద్ద నాణెం

ప్రపంచంలో మిక్కిలి పెద్ద నాణెం పొడవు 2 అడుగులు, వెడల్పు ఒక అడుగు, బరువు 40 పౌన్లు. ఈ 10 డేలర్ల రాగి నాణేన్ని 1644 లో స్వీడెన్‌లో అవెస్టాలో ముద్రించారు. అలాంటి నాణేలు 26,552 ఆ నాడు విడుదల చేసినా, ప్రస్తుతం వాటిలో 3 మాత్రమే ఉన్నాయి.

"కచ్చితమైన రోగ నిదానం సుప్రాతిక చికిత్సతో సమానం!"—మహాత్మా గాంధీ



వాలిఉన్నట్టు అవికనిపిస్తాయి. కంటికి సూటిగా దూర భూ రేఖ (horizon) దగ్గిర అవి కలుసుకున్నట్టు అనిపిస్తాయి. అందుచేత - ఒక ఇల్లు లేదా పుస్తకం లాంటి సమాంతర రేఖలు గల వస్తువులలో కలుస్తున్నట్టు కనిపించే రేఖలను అదే విధంగా వాలి ఉన్నట్టు మీరు గియ్యాలి. అలా రేఖలు కలుస్తున్నట్టు కనిపించే బిందువును 'అంతర్ధాన బిందువు' (vanishing point) అంటారు.

ఒక వీధిని పరిశీలనగా చూడండి. పేవ్‌మెంట్, ఇళ్ళు, కిటికీలు, ఇంటి కప్పులు, ఎలెక్ట్రిక్ స్తంభాలు - అన్నిటి రేఖలూ 'అంతర్ధాన బిందువు' వైపు వాలి ఉన్నట్టు కనిపిస్తాయి. ఒక ఇంటి లోపలి దృశ్యాన్ని కూడా నిశితంగా పరిశీలించండి. వాలు రేఖలు (సరళ రేఖకు దూరంగా పోయేవి) అన్నీ దృష్టి రేఖ (eye level) మీద ఎక్కడో ఒక చోట కలుస్తాయి.

అందుచేత ఒక పల్లెపట్టు దృశ్యాన్ని గాని, ఒక వీధి దృశ్యాన్ని గాని, ఒక ప్రకృతి దృశ్యాన్ని గాని గియ్యవలసి వచ్చినప్పుడు ముందుగా దూర భూ రేఖ (దృష్టి రేఖ) ను గీసుకోండి. అప్పుడు ఆ రేఖ మీద 'అంతర్ధాన బిందువు'ను గుర్తించుకోండి. అక్కడి నుంచి మీరు చిత్రించదలుచుకున్న ఇల్లు, రోడ్డు మొదలైన వస్తువుల దగ్గిరికి నిర్దేశక రేఖలు (guide lines) గీసుకోండి (చూ. చిత్రం- పుట 23.)

---

## 'పయొనీర్' పత్రికకు అమెరికన్ అవార్డు

లక్నో (ఉ. ప్రదేశ్) నుంచి గత 120 ఏళ్ళుగా ప్రచురించబడుతున్న ఇంగ్లీష్ దిన పత్రిక 'పయొనీర్'ను అభివృద్ధి చెందుతున్న దేశాలలోని పత్రికలలో జనాభా వివరాలు ప్రశస్తంగా ప్రకటిస్తూన్న పత్రికగా గుర్తించి వాషింగ్టన్‌లోని 'పాపులేషన్ ఆక్షన్ కౌన్సిల్' వారు అవార్డు అందజేశారు.

" 'సుఖం' 'ఆనందం' కాదనీ,
'ఆకర్షణ' 'సౌందర్యం' కాదనీ గుర్తించు!" —రవీంద్రనాథ్ టాగూర్




నిర్ణీతమైన ఒక చిత్రంలో బొమ్మను గియ్యాల అనుకుంటే దూర భూ రేఖను కేంద్రానికి పైగా గీసుకోడం మంచిది. అప్పుడు వస్తువు పై భాగం నుంచి కనిపించే దృశ్యాన్ని (bird's eye view) మనం చిత్రించడానికి వీలవుతుంది. చిత్రంలో కేంద్రానికి దిగువగా దూర భూ రేఖను గీసుకుంటే నేల మట్టం నుంచి చూస్తే కనిపించే ఆ వస్తువు దృశ్యం (worm's eye view) వస్తుంది. ఆ చిత్రంలో నేల మీద పాకే ఒక కీటకానికి కనిపించేట్టు ఆకాశం భాగం చాలా ఎక్కువగా ఉంటుంది. కార్టూన్‌లలో వస్తువును చూసే వివిధ దృక్కోణాలు చాలా ముఖ్యం. చిత్రంలో సరిగ్గా మధ్య భాగాన దూర భూ రేఖను ఎన్నడూ గీసుకోకూడదు.

**అతిశయోక్తి**: దూర, సామీప్య చిత్రణకు సంబంధించిన కొన్ని సూత్రాలను మీరు నేర్చుకున్నారు. కార్టూనిస్టుగా ప్రతి అంశంలోనూ అతిశయోక్తిని ప్రదర్శించడం అవసరం గదః అందుచేత - దూర, సామీప్య చిత్రణలో కూడా అతిశయోక్తిని ప్రకటించాలి. అప్పుడే మీ కార్టూన్ చూపరులకు నవ్వు పుట్టిస్తుంది. వెనుకటి పుటలో ఇచ్చిన కార్టూలలో చివరి దాన్ని చూస్తే దూర, సామీప్య చిత్రణలో అతిశయోక్తిని ఎలా పాటించవచ్చో మీకు తెలుస్తుంది. (సశేషం)

---

(20 వ పేజీ తరువాయి)

'హరి దాసులు' అనబడే కర్ణాటక ... పరంపరలో పురందర దాసు అగ్రేసరుడు. కీర్తనల ద్వారా భక్తినీ, వేదాంతాన్నీ, ... గ్యాన్నీ ఆయన ప్రజలకు బోధించి... గొప్ప సంకీర్తన కర్త అయి, సంగీతం ... సాహిత్యం చేతా 'భక్తి' కి ఆయన పరి... చేయించాడు. కర్ణాటక సంగీత మా... ఒక నిర్దిష్ట రూపాన్ని కల్పించాడు. 'పురందర దాసు' దేవరనామా తోనే ద... భారత దేశంలో కర్ణాటక సంగీతం పా... ప్రారంభిస్తారు. అనంతర వాగ్గేయకా... త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితర్ ... వారు పురందరదాసు కీర్తనల నుంచే ఉ... పొందారు. మహాభక్త కవిగానే కాక, ... టక సంగీత పితామహుడు'గా కూడా ... దర దాసు కీర్తించబడుతున్నాడు.

"ఆత్మ విచారణే లక్ష్యసిద్ధికి దారి తీస్తుంది." —పతంజలి

# విజ్ఞానవేదిక

## ఎడారులు ఎలా ఏర్పడుతాయి?

ర్షాలు పడక, చెట్లు చేమలు మొలవని బయలు ప్రదేశాన్ని 'ఎడారి' అంటారు. ధారణంగా ఎడారులు ఒక భూఖండం



్య భాగంలో ఉంటాయి. అవి సముద్ర నికి దూరంగానూ, ఎత్తైన పర్వతాలచేత ుద్రతీరం నుంచి వేరు చేయబడుతూనూ ాయి.

భూభాగం మీదుగా వీచే గాలులు ఎక్కు పొడి గాలులే! సముద్రం మీద నుంచి తేమతో కూడిన గాలులలోని తేమ అవి ం నడిభాగానికి వచ్చేలోగా హరించి ంది. సముద్ర తీరానికి చేరువగా ఉన్న ్న కొండలమీదుగా ఆ గాలులు పయనించే లో వాటిలోని తేమను అవి మరింత గా కోల్పోతాయి.

ఆఫ్రికాలోని సహారా ఎడారి గాని, ఆసియా లోని గోబీ ఎడారి గాని, మధ్య ఆస్ట్రేలియా, ఉత్తర, దక్షిణ అమెరికాలలోని ఎడారులు గాని ఖండం మధ్యభాగంలో ఉండడమో, ఒకవేళ సముద్రతీరానికి చేరువగా ఉంటే ఆ తీరం నుంచి ఎత్తైన కొండలచేత వేరు చేయబడి ఉండడమో కనిపిస్తుంది.

ఏ భూభాగంలో మొక్కా, మోడీ మొల వదో అక్కడ పగలు తీవ్రమైన ఎండా, రాత్రి పూట తీవ్రమైన చలీ ఉంటాయి. దీనివల్ల రాళ్ళు పగుళ్ళు ఇచ్చి విడిపోతాయి. గాలులు వాటిని గులకరాళ్ళు గానూ, ఇసుక కణాలు గానూ మారుస్తాయి. అందుకే చెట్టూ, చేమా లేక పోవడమే కాకుండా, ఎడారులు సాధా రణంగా ఇసుకతోనూ, గులకరాళ్ళతోనూ నిండి ఉంటాయి.

---

## 'హిందూ' పదం వ్యుత్పత్తి

ప్రాచీన పర్షియనులు మన 'సింధు' నదిని 'హిందు' అనేవారు. సంస్కృత పదాలలోని 'స' వర్ణం వాళ్ళ భాషలో 'హ' వర్ణంగా మారుతుంది. 'గ్రీకు'లు ఆ 'హ' కారం పలుక లేక 'హిందు' 'ఇండస్' అనడం, ఆ విధంగా మనం 'ఇండియన్' లం కావడం జరిగింది.

"పిల్లలు అక్కర లేనివాడు
పెళ్ళి చేసుకోడం అనవసరం!"
—మహాత్మా గాంధీ

# 'నేను చూసిన ఆంధ్ర చారిత్ర స్థలం

అంగర కృష్ణారావు, విశాఖపట్నం.

ప్రపంచ శిల్పకళా చరిత్రలో ఆంధ్ర శిల్ప కళకు ప్రత్యేక స్థానం ఉంది. దీనికి కారణం చాలా వరకు ఆంధ్ర శిల్ప సంప్రదాయానికి లక్ష్యాలుగా నిలిచిన అమరావతి, నాగార్జున కొండల లోని బౌద్ధ శిల్పాలే అనవచ్చు.

గుంటూరు పట్టణానికి సుమారు 25 మైళ్ల దూరాన, కృష్ణా నదీ తీరాన ఉన్న ఒక ప్రాచీన పుణ్య క్షేత్రం అమరావతి. ఇక్కడ శివుడు పంచ లింగాకారంతో కనిపిస్తాడు. అమరేశ్వర స్వామి, బాలా చాముండికాంబ ఇక్కడ భక్తుల సేవ లందుకుంటున్నారు.

అమరేశ్వ రాలయం ఆదిలో బౌద్ధారామ మనీ, కాల క్రమేణ శివ క్షేత్రంగా రూపాం తరం చెందిం దనీ చరిత్ర చెబుతున్నది. ఇక్కడి శివ లింగం ఎత్తు సుమారు 15 అడుగులు. ప్రాచీన కాలంలో ఇది ఒక ఆయక స్తంభ మనీ, అనంతరకాలంలో శివ లింగంగా ప్రతిష్ఠితమై పూజ లందుకుంటున్న దనీ ఒక కథ ఉంది. ఇచ్చటి జగత్ప్రసిద్ధ మైన బౌద్ధ స్తూపం ఆంధ్ర శిల్ప కళకు గొప్ప మచ్చు తునక. ప్రజాపతికీ, గౌతమికి వివాహ మైన సందర్భంలో నందుని బౌద్ధ స్వీకార ఘట్టం, ఉన్మత్తగజం నలగిరిని బుద్ధభగవానుడు అదు లోనికి తెచ్చిన ఘట్టం, ఇంకా బుద్ధుని జీవిత

---

## మొదటి హిందూ సాంస్కృతి రాయబారి - అగస్త్య ముని



వింధ్య పర్వతాలు దాటి దక్షిణ భార దేశానికి వచ్చి, తమిళ భాషకు 'అగత్తియవ్ అనే వ్యాకరణాన్ని రచించిన అగస్త మహర్షి ఆగ్నేసియా దేశాలకు కూడా వె అక్కడ హిందూ సంస్కృతిని వ్యాపిం చేశారు. ఇండో - చీనా, ఇండోనేషియాల అగస్త్యుణ్ణి గురించిన కథ లెన్నో ప్ర రంలో ఉన్నాయి.

"జీవితంలో అన్నిటికంటె మంచి లక్షణం 'ఏకాగ్రత' " —ఎమర్సన్

'ని వివిధ సన్నివేశాలూ జీవం ఉట్టిపడుతూ నాటికీ ఈ శిల్పాలలో నిలిచి ఉన్నాయి.

ఇచ్చటి ఆలయ కుడ్యాల మీద అమరావతి భువులూ, కొండవీటి రెడ్డి రాజులూ యించిన శాసనాలు ఎన్నో కనిపిస్తు న్నయి. శ్రీకృష్ణ దేవరాయలు ఇక్కడ ఒక ండపం కట్టించి శాసనం వేయించాడు. రాతత్త్వ పరిశోధకులకు అమరావతి న్నిధి. ప్రాచీన కాలంలో ఇక్కడ గొప్ప ద్యా పీఠాలు ఉన్నట్టు ఇక్కడి శాసనాల ్ల తెలుస్తూంది. చైనా, జపాన్, టిబెట్, ంలంకల నుంచి విద్యార్థులు వచ్చి ఇక్కడ కునే వారు.

* * *

యు విజయ, సాలూరు.

శ్రీకాకుళం జిల్లాలో ఉన్న కళింగ పట్ట ం ప్రాచీన కాలంలో గొప్ప రేవు పట్టణంగా సిద్ధి పొందింది. ఇక్కడ వంశధారా నది ముద్రంలో కలుస్తూంది. 'క్లింగ్' అనే ం నుంచి కళింగ శబ్దం వచ్చినట్లు చెబు న్నారు. ఈ కళింగ పట్టణంలో జరిగిన ద్ధమే అశోకునిలో హృదయ పరివర్తన గించి, అతడు బౌద్ధ మతాన్ని అవలంబించ ికి కారణ మైంది. సముద్ర గుప్తుడు ందలైన రాజుల కాలంలో కళింగ పట్టణం వు ద్వారా విదేశీ వ్యాపారం విరివిగా గేది.

కళింగ పట్టణానికి సమీపంలో సాలి ండం అనే కొండ ఉంది. ఇక్కడ జరి త్రవ్వకాలలో బయట పడిన విగ్రహాలు చీన ఆంధ్ర శిల్ప కళా వైభవాన్ని చాటు న్నాయి. ఇక్కడ కొన్ని బౌద్ధస్తూపాలు కూడా ఉన్నాయి. వాటి మీద వివిధ భాషలలో బౌద్ధ సూత్రాలు మొదలైనవి చెక్కబడి ఉన్నాయి.

కళింగ పట్టణంలో ఇటీవల - అంటే 1979 నవంబరులో - జరిపిన త్రవ్వకాలలో ఒక బౌద్ధ స్తూపం బయట పడింది. ఈ స్తూపం అమరావతి స్తూపాన్ని పోలి ఉంది. క్రీ.శ. 2వ శతాబ్దం నాటి ప్రాచీన నాణేలూ, పూసలూ మొ.నవి కూడా బయట పడ్డాయి.

కళింగ పట్టణంలో 60 5 అ.ల ఎత్తు గల



55 కోట్ల సం.ల క్రితం నుంచి 2౬ కోట్ల సం.ల క్రితం వరకూ సముద్రాలలో జీవిం చిన ఒక ప్రాచీన జలచరం 'ట్రైలోబైట్'. బల్లపరుపుగా, అండా కారంగా ఉండే ఈ జంతువు దేహం 3 భాగాలుగా విడిపోయి ఉంటుంది. న్యూయార్క్‌లో దొరికిన ఈ జంతువు శిలాస్థి ఒకటి ఓహియో స్టేట్ యూనివర్సిటీ మ్యూజియమ్‌లో ఉంది.

"మాటలో నిదానం, చూపులో చురుకుదనం అలవరచుకో!" —సెర్వాంటిస్

పెద్ద లైట్ హౌస్ ఉంది. ఇక్కడ ఉన్న మరొక ముఖ్య స్థలం హరిహరనాథ దేవాలయం. ఇక్కడి మదనా సాహెబ్ సమాధి కూడా ప్రజలను ఎక్కువగా ఆకర్షిస్తోంది.

* * *

ఎం. సునిత్ కుమార్, చిలకలూరిపేట

'లేపాక్షి' పేరు వినని ఆంధ్రుడు ఉండడు. ఆంధ్రప్రదేశ్‌లో దర్శించ దగ్గ ముఖ్య మైన చారిత్రక స్థలాలలో 'లేపాక్షి' ఒకటి. లేపాక్షి అనగానే స్వర్గీయ అడవి బాపిరాజు గారి 'లేపాక్షి బసవయ్యా! లేచి రావయ్యా!' అనే పాట గుర్తుకు వస్తుంది.

అనంతపురం జిల్లాలోని ఒక చిన్న పల్లెటూరు లేపాక్షి. దీనికి లేపాక్షి అన్న పేరు రావడానికి స్థానిక జనులు ఒక కథ చెబుతారు. రామాయణంలో రామ లక్ష్మణులు సీతాన్వేషణ చేస్తూ వస్తూ ఉండగా ఈ స్థలంలో వారికి కొన ఊపిరితో పడి ఉన్న జటాయువు కనిపించాడట. ప్రేమతో ఆయనను శ్రీరాముడు 'లే పక్షీ!' అన్నాడట. ఆ మాటే క్రమంగా 'లే పాక్షి'గా మారిం దని ప్రసిద్ధి!

ఈ దేవాలయ ప్రాంగణంలో కనిపించే పాద ముద్రలను సీతమ్మ పాద ముద్రలు అంటారు. విజయనగర రాజు రామరాయల వద్ద తహశీల్దారులుగా పనిచేస్తున్న వీరన్న, విరుపన్న అనే ఇద్దరు సోదరులు లేపాక్షి దేవాలయం కట్టించా రనీ, ప్రభుత్వ ధనం దుర్వినియోగం చేసిన నేరానికి రామరాయలు వారి కళ్ళు పీకించా రనీ ఒక ఐతిహ్యం. ఇక్కడి దేవాలయం చాలా పెద్దది. ఆలయ ప్రాంగణంలో పెద్ద పెద్ద బండలను తొలిచి చెక్కిన విగ్రహాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో ప్రధానమైంది - 'మహానంది'. అదే 'లేపాక్షి బసవయ్య'. రంగ మండపంలోనూ, శయనాగారంలోనూ, గర్భ గుడిలోనూ, పై కప్పుల మీదా కనిపించే చిత్రాలు చూడడానికి రెండు కళ్ళు చాలవు. ప్రతి ఆంధ్రుడూ తప్పక చూసి తీరవలసిన శిల్ప, చిత్ర కళా నిధానం లేపాక్షి దేవాలయం!

## "నేను ఏ ప్రభుత్వానికీ వ్యతిరేకిని కాను!"



నూటికి నూరు పాళ్ళు నిజాయితీ, సత్యాన్ని ఆరాధించే స్వభావం మహాత్మాగాంధీని కోట్లాది ప్రజలకు ప్రియతము డైన నాయకుణ్ణి చేశాయి. ఆయన ఇలా అనేవారు: "నేను ఏ ప్రభుత్వానికీ వ్యతిరేకిని గాను. అసత్యానికి నేను వ్యతిరేకిని: 'హంబగ్'కి నేను వ్యతిరేకిని: అన్యాయానికి నేను వ్యతిరేకిని!"

"బిచ్చం ఎత్తుకోడం కంటె అప్పులు చెయ్యడం గొప్ప కాదు!" — లెస్సింగ్


గ్రామ గ్రామానికి
నీరు, విద్యుచ్ఛక్తి
ఇరవై అంశాల
కార్యక్రమ గాథ
కూడా ఇదే

# ప్రపంచ వార్తలు

## కళ్ళకు కనిపించని వాయుయానం :

విమానం మీద నుంచి యుద్ధ నౌకల మీదికి ప్రయోగించే కొత్త రకం క్షిపణి (missile) ని – శత్రువుల రాడార్ తెర మీద కనిపించకుండా ఉండే దాన్ని – జపాన్‌లోని డిఫెన్స్ ఏజన్సీ ఇప్పుడు తయారు చేసింది. ఈ క్షిపణి రెక్కలకు ఫెర్రెట్ పౌడర్ పూయడం వల్ల అది రాడార్ కంటికి కనిపించదట!

* * *

## అంటార్కిటికాలోని మంచి నీరు :

దక్షిణ ధ్రువ ప్రాంతాన్ని పరిశోధించిన రష్యన్ శాస్త్ర వేత్తలు అక్కడ 1.4 కోట్ల చ.కి.మీ.ల ప్రాంతంలో 2.5 కోట్లఘ.కి.మీ.ల మంచు ఉందని అంచనా వేశారు. భూ గోళం మీది మొత్తం మంచి నీటిలో 85 శాతం ఈ మంచు ఖండంలో గడ్డ కట్టి ఉందట! భూ గోళం అంతటి మీద ఆ మంచును సరిసమానంగా పరిస్తే 50 మీ.ల దళసరి గల ఒక పొర ఏర్పడుతుంది. ఆ మంచు అంతా ఒక్కసారి కరగడం సంభవిస్తే సముద్ర మట్టం ఎత్తు 60, 70 మీటర్లు పెరుగుతుంది; భూ గోళం మీది భూభాగంలో 10 శాతం జలమయం అవుతుంది.

* * *

## అయస్కాంత శక్తితో పని చేసే కుక్కర్ :

ద. కొరియాలోని సామ్ సుంగ్ ఎలెక్ట్రానిక్స్ కంపెనీ వారు అయస్కాంత శక్తితో వంట వండే ఒక పాత్రను తయారు చేశారు. 'ఇండక్షన్ కుక్కర్' అనబడే ఈ పాత్ర ఎలెక్ట్రిక్ కుక్కర్లకంటె, మైక్రోవేవ్ పొయ్యిల కంటె భిన్నమైంది. అగ్ని ప్రమాదానికి గాని, ప్రేలుడు ప్రమాదానికి గాని అవకాశం లేని ఈ కుక్కర్ చాలా తక్కువ విద్యుచ్ఛక్తితో పని చేస్తుంది.

---

## ఇండియాలో మిక్కిలి చిన్న జిల్లా!

బీహార్‌లోని రాంచికి పడమరగా 75 కి.మీ.ల దూరంలో ఉన్న 'లోహార్‌డగా'యే ఇండియాలోని మిక్కిలి చిన్న జిల్లా. 354 గ్రామాలతోనూ, సుమారు 2 లక్షల జనాభాతోనూ కూడిన ఈ జిల్లాలో 60 శాతం ఆదిమ జాతుల వారు.

---

"మనం చేసే ఘనకార్యాల వెనుక ఉన్న మన స్వార్థ దృష్టి
లోకం కంటపడితే తరుచు మనం సిగ్గు పడవలసి వసుంది." – రో చెఫౌకాల్

## ఎందుకు?

# కోతులు మాలిష్ చేసుకోడం ఎందుకు?



'రీసస్' వంటి కొన్ని జాతుల కోతులలో ఈ ఆచారం మరీ ఎక్కువ. దీనివల్ల వాటికి మానసికంగానూ, సాంఘికంగానూ కూడా మేలు కలుగుతుంది. పరస్ప రానుబంధాలు పెరగడం, నరాల బిగువు సడలడం ఇందు వల్ల జరుగవచ్చునని శాస్త్రజ్ఞులు నమ్ము తున్నారు. ఒకదాని చర్మం ఒకటి నిమురుతూ దుమ్మూ ధూళీ పోగొట్టడం వాటి ఆరోగ్యానికి కూడా మంచిది.

# 378 వాద్యాలను వాయించగల యంత్రం

19 వ శతాబ్దం నాటి కార్ల్ వేట్జిల్ అనే ఒక ఆస్ట్రియన్ వ్యక్తి ఏక కాలంలో 378 సంగీత వాద్యాలను వాయించేందుకు తోడ్పడే 'పానోమానికా' అనే ఒక యంత్రం కని పెట్టాడు. నాటి ఆస్ట్రియా ఆర్చ్ డ్యూక్ ఛార్లెస్ ఆ యంత్రాన్ని కొన్నాడు. అయితే - సంగీత ప్రజ్ఞా ప్రదర్శనకు గాక తన ఆస్థా నంలో గలభా చెలరేగినప్పుడు దానిని అణ చేందుకు ఆ యంత్రాన్ని ఆయన వాడేవారట!

# బంగారు ఆభరణాల వాడకంలో అగ్రస్థానం ఇండియాదే!

బంగారంతో, వజ్రాలతో చేసిన ఆభర ణాలు ఎక్కువగా వాడుక చేయడంలో ప్రపం చంలో ఇండియాదే అగ్రతాంబూలం! ఏటా 100 టన్నుల బంగారు ఆభరణాలు ఇక్కడ ఖర్చవుతున్నాయి. ఇండియాలో దాదాపు 10 లక్షల మంది బంగారు పనివారు ఉన్నారు.

# భావ పరిచయ పోటీ

(మార్చి 1984)

★

"నేటి చిత్ర ప్రదర్శన శాలలు
చోరుల పాలిట విశ్వవిద్యాలయాలు!
—శ్రీపిల్లి ధనలక్ష్మి, విశాఖపట్టణం.

* * *

"సినిమాలో యాక్షన్
ప్రేక్షకుల్లో కలిగిస్తుంది రియాక్షన్!"
—ఎన్. రామలింగేశ్వరరావు, కలకోట.

* * *

"నిన్నటి తెరపై ఆట!
నేటి జీవితపు బాట!!"
—ఆర్. శిరీష, హనుమకొండ.

---

"లోపాలు లేని మనిషి అంటూ ఉండడు:
తక్కువ లోపా లున్నవాడే ఉత్తముడు!" -హొరేస్

# సక్రమంగా ఆలోచించడం ఎలా?

హెచ్. కే. లక్ష్మణరావు

* చిన్న చిన్న సమస్యలూ, చిన్న చిన్న ఆశాభంగాలూ కూడా మిమ్మల్ని తల్లక్రిందులు చేస్తూ ఉంటాయా?
* తోటి మనుష్యులతో వేగడం మీకు కష్టంగా అనిపిస్తుందా?



* మీతో కలిసి పనిచేసే వారు మీతో సరిపుచ్చుకోలేక ఇబ్బంది పడుతూ ఉంటారా?
* తరచు ఏదో తొందర, ఎవ్వరో తరుముకొస్తున్నట్టు భావన, ఆదుర్దా, భయం మీకు కలుగుతూ ఉంటాయా?
* గడిచిపోయిన చిన్న చిన్న సంఘటనల్ని గురించి ఆలోచించకుండా, మథనపడకుండా ఉండగలగడం మీకు దుర్ఘటంగా కనిపిస్తుందా?

పై ప్రశ్నల కన్నిటికీ గాని, చాలా వాటికి గాని మీ సమాధానం 'అవును' అని వస్తే మీ ఆలోచన సరళిని కాస్త సరిదిద్దుకోవలసి ఉంది అని అర్థం. మన చుట్టూ ఉన్న ప్రపంచాన్నీ, మన ఆఫీసులలో పరిస్థితుల్నీ, మన సంసారాలలోని స్థితిగతులనూ మనకు కావలసిన విధంగా మనం ఎన్నటికీ మార్చుకోలేమని ముందుగా మనం గుర్తించాలి. ఇక గతాన్ని అసలే మార్చలేము. మనం చేయగలిగితే మనల్ని మనం మార్చుకోగలం; గతాన్ని మరచిపోగలం. మన గమ్యాలను సాధించేందుకు ఆచరణ యోగ్యమైన విధానాలనే మనం ఎన్నుకోవాలి. లేకపోతే మన మానసిక, శారీరక శక్తులు దుర్వినియోగం అవుతాయి.

దేవుడు మనుష్యులకు 'ఆలోచన' అనే అద్భుతమైన శక్తిని ప్రసాదించాడు. మన మెదడులోని జీవకణాలలో (cells) నిలువ ఉండే జ్ఞాపకాల ప్రతిధ్వనులే ఆలోచనలు.

## ఇండియాలో 'జడ్జి' అయిన మొదటి ముస్లిమ్ మహిళ!

కేరళ హైకోర్టులో అడిషనల్ 'జడ్జి'గా నియమించబడిన మిస్ ఫతీమా బీబీయే ఇండియాలో 'జడ్జి' అయిన మొదటి ముస్లిమ్ మహిళ. తిరువాన్కూర్ - కొచ్చిన్ రాష్ట్రంలో న్యాయశాస్త్రం అభ్యసించిన తొలి ముస్లిమ్ మహిళ కూడా ఫతీమాయే.

"ఉదయం లేచింది మొదలు పడుకోబోయేదాక కీటకంలాగ ఎవరి విధి వారు నిర్వర్తించడం - అదే ముక్తికి సరియైన మార్గం." —వివేకానంద స్వామి

ఆలోచనా శక్తిని సక్రమంగా వినియోగించు కుంటే జీవితంలో మనకు ఎదురయ్యే సమస్యల పట్ల హేతుబద్ధ మైన, ఆచరణయోగ్య మైన వైఖరిని అవలంబిస్తాము. సక్రమ పద్ధతిలో సాగకపోతే ఆ 'ఆలోచనా' శక్తే నిరాశా, నిస్పృహలకు కారణమై జీవితంలో 'ఆందోళన'కు దారితీస్తుంది. అప్పుడు మన 'ఆలోచనా' శక్తే మన పాలిట శాపం అవుతుంది.

ఆలోచనలను బట్టే జీవన వైఖరి (attitude) ఏర్పడుతుంది. ఆలోచించడం మన సహజ స్వభావం. ఏ పని చేస్తున్నా, ఏ పనీ చెయ్యకుండా విశ్రాంతిగా ఉన్నా, నిద్ర పోతున్నా, మెలకువగా ఉన్నా మన 'ఆలోచన' పని చేస్తూనే ఉంటుంది.

సాధారణంగా మనస్సుకు మనం విశ్రాంతి ఇవ్వము. అవసర మైనవీ, అనవసర మైనవీ - ఎన్నెన్నో అంశాలను మనస్సు ప్రతిక్షణం సేకరిస్తూ ఉంటుంది. వాటిని గురించే మథన పడుతూ ఉంటుంది.

దురదృష్ట వశాత్తు మనం ఆలోచించే పద్ధతిని చిన్నతనం నుంచే మన తల్లి దండ్రులూ, ఉపాధ్యాయులూ, మన చుట్టూ ఉన్న సంఘం నిర్ణయించి వేయడం జరుగుతూంది. నిజానికి మనం ప్రకటించే ఆలోచనలు చాలావరకూ ఇతరులవే—మనవి కావు! ఎలా ఆలోచించాలి అని కాక, ఏమి ఆలోచించాలో వారు మనకు నేర్పుతున్నారు.

మనకు ఎదురైన ప్రతి పరిస్థితినీ-అనుకూలమైన దైనా, ప్రతికూలమైన దైనా-గోరంతలు కొండంతలుగా చేసుకోడం మనకు అలవాటు. మన శక్తి సామర్థ్యాల మీదా, కార్య దక్షత మీదా, మన కలుపుగోలుతనం మీదా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో మన ఆలోచనల ప్రభావం విధిగా ఉంటుంది.



మన భయాలూ, సుఖాలూ, దుఃఖాలూ, కోపం, భద్రతలేదనే భావం మొదలైన వన్నీ మన ఆలోచనల నుంచి పుట్టేవే! 'అనుకూలం', 'ప్రతికూలం' అంటూ నిజంగా ఏదీ లేదనీ మన ఆలోచనలే వాటిని అలా

## మిక్కిలి బక్కపల్చని వ్యక్తి

1797 ఏప్రిల్ 10 న ఒక నిరుపేద ఫ్రెంచ్ దంపతులకు పుట్టిన క్లాడ్ ఆంబ్రోయిస్ స్యూరట్ ప్రపంచం అంతటిలో మిక్కిలి బక్కపల్చని వ్యక్తి. పూర్తి పెరుగుదల అనంతరం అతని వీపుకీ, రొమ్ముకీ మధ్య మందం కేవలం 3 అం.లు. తన 28 వ ఏట 1825 లో లండన్‌లో తనను చూడడానికి టికెట్ పెట్టి క్లాడ్ చాలా డబ్బు సంపాదించాడట!

"నిజం తెలుసు కోడం కష్ట సాధ్యమే:
అయినా తొందరపాటు నిర్ణయాలకంటె అది మంచిది!"

కనిపించేట్టు చేస్తాయనీ అనవచ్చును.

పిల్లల్ని బడికి పంపడం, వాళ్ళు భద్రంగా ఇంటికి తిరిగిరావడం, గ్యాస్ అయిపోవడం, పిల్లలకు స్కూల్లో మంచి మార్కులు రాక పోవడం — ఇలాంటి ఎన్నో విషయాలను గురించి సాధారణంగా మన గృహిణులు నిత్యం ఆందోళన పడుతూ ఉంటారు.

ఆలోచించడం వేరు; ఆందోళన పడడం



వేరు. మొదటిది నిర్మాణాత్మకం; మంచి ఫలితాలు ఇవ్వగలది. రెండోది వినాశాత్మకం; కష్టాల పాలు చేసేది. మనం లోకాన్ని చూసే తీరు, జీవితంలో విలువలను గూర్చిన మన అభిప్రాయాలు - వీటి ప్రభావం మన ఆలోచనల మీద ఎక్కువగా ఉంటుంది.

ఆలోచన చేసేటప్పుడు ఎంత మానసిక శక్తి వ్యయం అవుతుందో సాధారణంగా మనం గుర్తించము.

శారీరకమైన అలసట, నరాల బిగువు లాంటివి కూడా చాలావరకు మన చేతులారా మనం తెచ్చిపెట్టుకునేవే; మన నిత్య జీవన విధానం, మన ఉత్పాదక శక్తి, ఇతరులతో మన అనుబంధాలు—వీటన్నిటికీ మన ఆలోచనల తీరుతో దగ్గిర సంబంధం ఉంది.

కొన్ని సందర్భాలలో మనలో నిరుత్సాహం, నీరసం కనిపిస్తాయి. ఇతర సమయాలలో కంటె అప్పుడు మన ఉత్పాదక శక్తి ఏమంత తగ్గదు గాని, అలా మన మానసిక స్థితిలో మార్పులు ఏర్పడడానికి కారణం మాత్రం మన ఆలోచనల తీరే;

మనస్సు సరియైన స్థితిలో లేకపోతే ఒక చిన్న పని చెయ్యడం కూడా ఎంతో కష్టంగా అనిపిస్తుంది. ఒక మామూలు సంఘటన కూడా విపరీతమైన చిరాకు కలిగిస్తుంది. మన మానసిక స్థితులు (moods) మన ఆలోచనల వల్ల ఏర్పడేవే; చిన్న చిన్న విషయాలకు కూడా ఆవేశపడి పోతూ ఉంటే మన మనస్సు మీద అనవసరపు బరువులు ఎత్తిన వాళ్ళం అవుతాము. దానితో మన నిత్య జీవితంలో అడుగడుగునా అవశ్యకమైన కనీసపు ఆలోచనా శక్తి కూడా మనలో లోపించి పోతుంది.

---

## మీరైతే?

(మార్చి 1984)

(ఇండియా ప్రధాని అయితే?)

★

"ఇండియాకు రెండవ మహిళా ప్రధానిని అవుతాను;"

—పి. లలిత, నెల్లూరు.

* * *

"వెంటనే రిజర్వేషన్లు రద్దు చేస్తాను;"

—ఎస్. ఉపేంద్రనాథ్, మెదక్ - 502 110.

---

"దుబారా దారిద్ర్యానికీ, దారిద్ర్యం పారతంత్ర్యానికీ, అవినీతికీ దారి తీస్తాయి." —జాన్సన్

పేరుకు పోయిన ఉద్వేగాల బరువు నుంచి క్రమబద్ధమైన ఆలోచన ద్వారా మనస్సుకు విమోచనం కలిగించాలి. అప్పుడే మనస్సు పటిష్ఠంగానూ, సృజనాత్మకంగానూ పని చేస్తుంది.



మనం చేస్తున్న పని ఉల్లాసం కలిగించేదయితే నిర్మాణాత్మకంగా మనం ఆలోచిస్తాము. మన శక్తులనూ, అవధానాన్నీ పూర్తిగా మనం చేస్తున్న పని మీదే లగ్నం చేస్తాము. అలాంటి సందర్భాలలో మన భౌతిక, మానసిక శక్తుల మధ్య చక్కని సమన్వయం ఏర్పడుతుంది. ఆ రెండిటి మధ్య సంఘర్షణ ఎప్పుడైతే ఉండదో అప్పుడు మనం చేస్తున్న పని వల్ల మనకు ఏ మాత్రం అలసట కలుగదు. చేస్తున్న పని మనకు ఉల్లాసం కలిగించేది కాకపోతే ఇందుకు పూర్తిగా విరుద్ధంగా జరుగుతుంది.

మనస్సు కోతి లాంటిది. ఒక ఆలోచన మీదనుంచి మరో ఆలోచన మీదికి ఎప్పుడూ గంతులు పెడుతూ ఉంటుంది. మనస్సు తాలూకు అవధానాన్నీ, ఉత్పాదక శక్తినీ పెంచాలంటే ముందు దానిని ప్రశాంతంగా ఉండేట్టు చెయ్యాలి.

ఏ పనుల విషయమై మనం శ్రద్ధ వహించాలో, వేటిని నిర్లక్ష్యం చెయ్యవచ్చో, వేటిని ఇతరులకు పురమాయించవచ్చో నిర్ణయించడం ఆలోచన కళలో ముఖ్యమైన అంశం.

ఆందోళన, ఆగ్రహం, అలసట గల వ్యక్తి స్పష్టంగా ఆలోచించలేడు. కలత చెందిన మనస్సు వస్తువులను సమగ్రంగా చూడలేదు. రాగద్వేషాలతో కూడిన 'మూసుకుపోయిన' (closed) మనస్సు అది.

ఆలోచనా కళ వల్ల మన ఆలోచనా శక్తిని గరిష్ఠ ప్రమాణంలో ఉపయోగించుకోగల నేర్పు మనకు అలవడుతుంది. మన ఆలోచనలు ఎంత స్పష్టంగా ఉంటే, అంత స్పష్టంగా వాటిని మనం ప్రకటించగలుగుతాము.

(మిగతా 56వ పేజీలో)

## స్త్రీల చేత వెట్టిచాకిరీ

తమిళనాడులో వేలూరులోని బీడీ ఫాక్టరీలలో స్త్రీలచేతా, పిల్లలచేతా చాలా తక్కువ కూలీ ఇచ్చి రోజుకి 10, 12 గంటలు వెట్టిచాకిరీ చేయించుకుంటున్నారని 'నేషనల్ లేబర్ ఇన్‌స్టిట్యూట్', 'నేషనల్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ వుమెన్' ప్రకటించాయి. ఒక యజమాని రూ. 200లు అప్పిచ్చినందుకు 3 ఏళ్ళ పాటు ఒక ఆడ కూలీ తాలూకు 8 ఏళ్ళ కొడుకునీ, 7 ఏళ్ళ కూతురునీ తన దగ్గర తాకట్టు పెట్టుకున్నాడట!

"సంఘంలో ఆచారాలు పరిపాకం చెందిన అనుభవాల ఫలితాలు;
కొంతవరకు మనం వాటికి తల ఒగ్గక తప్పదు." —ఏ.ఏ. హాడ్జె

(16 వ పేజీ తరువాయి)

ద. కొరియా ఎన్నబడుతూంది. అనతి కాలంలోనే అభివృద్ధి చెందిన దేశాలలో చేర గల శక్తి సామర్థ్యాలను ప్రదర్శిస్తూంది. కొరియన్ యుద్ధం (1950-53) వల్ల కలిగిన నష్టం నుంచి దేశం ఇంకా పూర్తిగా కోలుకోక పోయినా గుర్తుపట్టడానికి వీలులేనంత ఎక్కువగా ఆ దేశం అభివృద్ధి చెందింది. టోకు జాతీయోత్పత్తిలో పరిశ్రమల వాటా 1962 లో 16 శాతం మాత్రమే కాగా, 1981 నాటికి 31 శాతానికి అది పెరిగింది.

ప్రపంచంలో ఉక్కు ఉత్పత్తి చేసే దేశాలలో ద. కొరియా ఇవాళ 13 వ స్థానాన్ని ఆక్రమిస్తూంది. 'పొహాంగ్ ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ'లో సాలుసరి ఉత్పత్తిని 55 లక్షల మెట్రిక్ టన్నుల నుంచి 85 లక్షల మెట్రిక్ టన్నులకు పెంచే పథకం ఇటీవలే పూర్తి అయింది. దీనితో ఆ దేశం సాలుసరి ఉక్కు ఉత్పాదన శక్తి 1.28 కోట్ల టన్నులకు పెరిగింది.

నౌకలను నిర్మించి ఎగుమతి చేసే దేశాలలో ద. కొరియా ప్రపంచంలో ఇప్పుడు రెండో స్థానంలో ఉంది. ద. కొరియాలోని నౌకా నిర్మాణ కేంద్రాలు 1981 లో 142 కోట్ల డాలర్ల విలువచేసే నౌకలను విదేశాలకు ఎగుమతి చేశాయి. 1980 లో కంటె ఇది 130 శాతం ఎక్కువ.

ఎలెక్ట్రానిక్ పరికరాల ఉత్పత్తిలో ప్రస్తుతం ద. కొరియా 10 వ స్థానంలో ఉంది. 1981 లో సుమారు 400 కోట్ల డాలర్ల విలువ చేసే ఎలెక్ట్రానిక్ పరికరాలను ద. కొరియా ఉత్పత్తి చేసింది. వీటిలో మూడో వంతు విదేశాలకు ఎగుమతి చేసింది.

ద. కొరియాలోని భవన నిర్మాణ సంస్థలు 30 విదేశాలకు సుమారు 1,60,000 మంది

## ఐఫెల్ టవర్ నుంచి దూకి ఆత్మహత్యలు



పారిస్‌లోని ఐపెల్ టవర్ నిర్మించిన తరువాత గడచిన ఈ 94 ఏళ్ళలో మొత్తం 360 మంది దాని మీద నుంచి దూకి ఆత్మహత్య చేసుకున్నారు. అలెగ్జాండర్ గుస్తావ్ ఐపెల్ (1832-1923) డిజైన్ చేసిన ఈ టవర్ నిర్మాణం 1889 మార్చి 31 న పూర్తి అయింది. దీని బరువు 7,340 టన్నులు; ఎత్తు 300.51 మీటర్లు. ఇటీవల దీనిమీద ఒక టీ.వీ. అంటెనా ఏర్పాటు చెయ్యడంతో ఎత్తు 320.75 మీటర్లకు పెరిగింది ఈ టవర్ నిర్మాణానికి 2 సం.లు, 2 నెలలు, 2 రోజులు పట్టింది; 77,99,401 ఫ్రాంక్‌లు ఖర్చయింది.

"మనకు సంబంధం లేని పనులు చెయ్యడం సోమరితనం కంటె హీనం!" —బాల్టస్టర్ గ్రేషియన్

నిపుణులైన కార్మికులను పంపి అక్కడ నిర్మాణాలను నిర్వహిస్తున్నాయి.

ప్రస్తుతం సుమారు 20 లక్షల హెక్టేర్ల భూమిలో 80 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను ఈ దేశంలో పండిస్తున్నారు. వీటిలో 55 లక్షల టన్నులు వరి.

అక్షరాస్యత 90 శాతం దాకా ఉన్న ద. కొరియా ఈ నాడు ప్రపంచంలో విద్యాధిక దేశాలలో ఒకటిగా ఎన్నబడుతూంది.

6 లక్షల పైచిలుకు కాపీలు ఖర్చయ్యే 21 దినపత్రికలు ప్రస్తుతం ద.కొరియాలో వెలువడుతున్నాయి. ప్రతి 10 కుటుంబాలకు ఇక్కడ ఒక టీ.వీ. సెట్టు ఉంది. వాటిలో సుమారు 15 శాతం కలర్ టీ వీ.లు.

1986 లో జరుగనున్న ఆసియా క్రీడలకూ, 1988 లో జరుగబోయే ఒలింపిక్ క్రీడలకూ దక్షిణ కొరియా రాజధాని 'సియోల్' రంగస్థలంగా ఎన్నుకోబడడం క్రీడల పట్ల ఆ దేశీయులకు గల ఉత్సాహానికీ, వారి కార్యదక్షతకూ నిదర్శనం. ఒలింపిక్ క్రీడలను నిర్వహించే తొలి వర్ధమాన దేశం ద. కొరియాయే!

వాక్ స్వాతంత్ర్యం, కళా స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం ద.కొరియాలో ఎక్కువగా కనిపిస్తాయి. ఈ దేశంలో బౌద్ధ మతస్థులు ఎక్కువ 1.23 కోట్ల బౌద్ధులు ఇక్కడ ఉన్నారు. క్రీ.పూ. 372 లో 'రాజ్యత్రయ యుగం'లో ఈ మతం కొరియాలో అడుగు పెట్టింది. 'కోర్యో' వంశ రాజుల హయాంలో అది ప్రభుత్వ మతం అయింది. రెండో పెద్ద మతం క్రైస్తవ మతం. 85 లక్షల మంది దాకా క్రైస్తవులు ఈ దేశంలో ఉన్నారు.

## రష్యాలో శత వృద్ధులు

ప్రస్తుతం సోవియట్ రష్యాలో 100 ఏళ్ళు పైబడిన శతవృద్ధులు 18,000 దాకా ఉన్నారు.

---

(54 వ పేజీ తరువాయి)

ఆలోచన శక్తిని నిశితంగా చేసుకునేందుకు మనస్సుకు విశ్రాంతిని ఇవ్వడం అవసరం. 'అకర్మ' (rest) నుంచే 'కర్మ' (action) పుడుతుంది. అప్పు డప్పుడు ఏ ఆలోచనలూ—మంచివి గాని, చెడ్డవి గాని—రాకుండా మన



స్సును ఖాళీగా ఉంచుకోడం అవసరం. అది మన ఆలోచనలకు నూతన శక్తిని సమకూరుస్తుంది. 'ధ్యానం'లో ఉన్న రహస్యం ఇదే!

ఆలోచన కళను అభ్యసిస్తే జీవితం పట్ల మన వైఖరినీ, ఎదుర్కోవలసి వచ్చే సమస్యలను పరిష్కరించుకునే విధానాన్నీ మనం మార్చుకో వచ్చును. నిజానికి మన ఆలోచనలే 'మనం'! అందుకే—సక్రమంగా ఆలోచించడం అలవరచుకుందాం!

"జీవితంలో దుర్వినియోగం చేసే భాగమే
జీవిత భారాన్ని పెంచుతుంది!" —రూసో



# రిని గురించి తెలుసుకోండి



డా. శ్రీదత్ సురేంద్రనాథ్ రాంఫల్: కామన్‌వెల్త్ రాజ్యాధినేతల సభ ప్రస్తుత ప్రధాన కార్యదర్శి. ఇంతకు ముందు గయానా ప్రభుత్వంలో విదేశాంగ మంత్రిగా, న్యాయ శాఖమంత్రిగా పనిచేశారు. న్యాయశాస్త్రంలో ఆయన ఎల్.ఎల్.బి (ఆనర్సు) ప్యాసై, అనంతరం లండన్ యూనివర్సిటీ కింగ్స్ కాలేజ్ నుంచి డిస్టింక్షన్‌తో ఎల్.ఎల్.ఎమ్. పట్టా పొందారు. 'ది ఇంటర్నేషనల్ కమిషన్ ఆఫ్ జూరిస్ట్స్' లో ఆయన సభ్యులు. ఏటేటా ఇచ్చే అలీన రాజ్యాల (third world) ప్రైజ్ నిర్ణాయక సంఘానికి ఆయన ఛైర్మన్!

* * *

సి. ఎమ్. స్టీఫెన్ (1918-1984): కేరళ రాష్ట్రానికి చెందిన సుప్రసిద్ధ భారత రాజకీయ నాయకులు; గొప్పవక్త. మన రాజ్యాంగాన్ని నిశితంగా అధ్యయనం చేసి, దానిని వ్యాఖ్యానించడంలో దిట్ట. 'హౌక ప్రభ' అని ఆయన నడిపిన మలయాళం పత్రిక తిరువాన్కూర్ సంస్థాన స్వతంత్ర ప్రతిపత్తిని సమర్థిస్తూ వ్రాసిందనే కారణంచేత నిషేధించబడింది.

* * *

ఎస్. ఏ. డాంగే: సుప్రసిద్ధ మహారాష్ట్ర కార్మిక నాయకులు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో పలుసార్లు జైలుకు వెళ్ళారు. మొత్తం 17 సంవత్సరాల కాలం జైలులో గడిపారు. బహుళ ప్రజాదరణ గల వక్త. 1957 నుంచి 1967 దాకా పార్లమెంట్ సభ్యులుగా ఉన్నారు. 'హెల్ ఫౌండ్' (నరక దర్శనం), 'లిటరేచర్ అండ్ పీపుల్', 'మహాత్మాగాంధీ అండ్ హిస్టరీ' వంటి గ్రంథాలు ఎన్నో వ్రాశారు.

* * *

దిలీప్‌కుమార్: సుప్రసిద్ధ హిందీ చలన చిత్ర నటులు. ఈ నాటికీ చిత్రంలో నటించినందుకు ఎక్కువ డబ్బు తీసుకునే నటులలో ఒకరు. ఉత్తమ నటుడుగా లెక్కలేనన్ని అవార్డులు ఆయన అందుకున్నారు. ఆయన నటించిన చిత్రాలలో మరపురాని వాటిలో కొన్ని: 'అందాజ్', 'దేవ్‌దాస్', 'మధుమతి', 'మెహూదీ', 'ముగల్-ఏ-అజామ్', 'రామ్ ఔర్ శ్యామ్', 'గంగా జమునా అండ్ గోపి'. బాడ్‌మింటన్ ఆట అంటే ఆయనకు చాలా ఇష్టం!

---

"గొప్పవారి లోపాలూ గొప్పవే అయి ఉంటాయి!"

(5 వ పేజీ తరువాయి)

సుప్రసిద్ధ కార్టూనిస్ట్ సంగీతం వింటూ కార్టూన్‌లు గీసేవాడట! మరో పేరెన్నిక గన్న ఇంగ్లీష్ నవలా రచయిత తన ఉత్తమ రచనలను 'స్ట్రింగ్ క్వార్టెట్' (నాలుగు తంత్రీ వాద్యాల సమ్మేళనం) చేత ప్రభావితుడైన దశలో వ్రాశాడట! న్యూయార్క్ మాజీ మేయర్ ఒకరు విసుగు పుట్టించే రిపోర్ట్‌లను శాస్త్రీయ సంగీతం రికార్డులు వింటూ చదివే వారు. అనుభవజ్ఞుడైన ఒక డాక్టర్ ఈల పాట పాడుతూ ప్రిస్క్రిప్షన్‌లు వ్రాసేవాడు.

భౌతిక సంపద వల్లనే ఒక దేశం సంపన్న దేశం కాదు. తర తరాలుగా వచ్చే సంగీతం. సాహిత్యం, శిల్పం లాంటి లలిత కళల ప్రభావం ప్రజల వ్యక్తిత్వాన్ని మల చడం మీద ఎంతైనా ఉంది. ఒక దేశ ప్రజలు ఎలా తమ లలితకళలను పోషించుకుంటున్నా రనేదే ఆ దేశపు నిజమైన ఔన్నత్యాన్ని చాటుతుంది.

లలితకళ లన్నిటిలో సంగీతం సర్వోత్కృష్టమైంది. ప్రశస్తమైన గానం 'దివ్యత్వం' దరిదాపుల దాకా మనల్ని కొనిపోగలదు. మన ఆవేశాలకు మార్దవాన్ని ఆపాదించ గలదు. సంగీతం వల్ల మన హృదయంలోని కల్మలా లన్నీ ప్రక్షాళన అయిన భావన మనకు కలుగుతుంది.

"శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసం ఫణిః". పశువులను కూడా సంగీతం అల రిస్తుంది. పాలు తీసేటప్పుడు సంగీతం విని పిస్తే ఆవులు ఎక్కువ పాలు ఇస్తున్నాయి. మృదువైన సంగీతం వింటూ కోడిపెట్టలు ఎక్కువ సంఖ్యలో, మరింత నాణ్యమైన గ్రుడ్లు పెడుతున్నాయి.

ఇక—చెట్లు? అన్నామలై విశ్వవిద్యాలయంలో ఒక సంగీత విద్వాంసుడూ. ఒక వృక్ష శాస్త్రవేత్తా కలపి చెట్లమీద సంగీత, నృత్యాల ప్రభావాన్ని పరిశోధించారు. 'మారిగోల్డ్' పూలమొక్కల ముందు రోజూ ఒక గంట 'భరత నాట్యం' చెయ్యడం వల్ల అవి మామూలు కంటె 60 శాతం ఎత్తుగా ఎదిగి, తక్కిన చెట్లకంటె 15 రోజులు ముందుగా పూతకు వచ్చాయి!

---

## ఇండియాలో వరదల బీభత్సం



1953-81 మధ్య వచ్చిన వరదవల్ల సగటున ఏటా 36 లక్షల హెక్టేర్‌లలోని రూ. 212 కోట్లు ఖరీదు చేసే పంట నష్టమైంది. వరదల కోసం ప్రభుత్వం రూ. 1136 కోట్లు ఖర్చు చేయవలసి వచ్చింది. ఇప్పటి వరకు 12,265 కి.మీ.ల కట్టలు వేయడం ద్వారా, 21,809 కి.మీ ల కాలువలు త్రవ్వడం ద్వారా 1.15 కోట్ల హెక్టేర్‌ల భూమికి మాత్రం వరదల నుంచి రక్షణ కల్పించ గలిగారు.

---

"చేజారిన స్వర్గానికి ప్రత్యామ్నాయంగా లభించిన కానుక 'భార్య!'" —గొయిథే

# పోటీలు

మే 1984

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: మే **20, 1984.** పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'సైన్సు - మతం' అనే అంశం మీద

## బెలూన్ సాయంతో మొదటి సుదీర్ఘ ప్రయాణం



1836 లో ఛార్లెస్ గ్రీన్, రాబర్ట్ హోలండ్ థామస్ మాంక్ మేసన్ అనే ముగ్గురు ఆంగ్లే యులు 80 అ.ల ఎత్తున ఒక రాకాసి బెలూన్ సాయంతో మొదటి సుదీర్ఘ ప్రయాణ చేశారు. నవంబరు 7 వ తేదీ మధ్యాహ్న 1-30 గం. లకు లండన్‌లోని వాక్స్ హాల్‌లో గాలిలోకి ఎగిరి, డోవర్, కెలే మధ్యగా ఇంగ్లీష్ ఛానల్ మీదుగా పయనించి మర్నాడు గాలివాటం ప్రతికూలం కా డంతో ఫ్రాంక్‌ఫర్ట్ - ఆమ్ - మెయిన్ వాయవ్యంగా 30 మైళ్ళ దూరంలో నే మీదకు దిగారు. 18 గం. లలో 480 మైళ్ళు వారు ప్రయాణించారు.

300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. మిక్కిలి చిన్న గ్రహం (planet) ఏది? 2. ప్రపంచంలో ఎక్కువ మంది మాట్లాడే భాష ఏది?, 3. 'విద్వాన్'కి స్త్రీ లింగం ఏమిటి? 4. ఇండియాలో 'సైనిక దినోత్సవం' (army day) ఏ రోజున చేస్తారు? 5. గడియారాలను ఎక్కువ సంఖ్యలో ఉత్పత్తి చేసే దేశం ఏది?, 6. 'మృచ్ఛకటికమ్' నాటకకర్త ఎవరు?, 7. 'యురేకా' (నేను తెలుసుకున్నాను) అని అరచింది ఎవరు?, 8. భారత కేంద్ర మంత్రి వర్గంలో ద్వితీయశ్రేణి మంత్రిని ఏమంటారు?

## పజిల్



ఆధారాలు—అడ్డం: 1. బెజవాడకి మరో పేరు, 4. కళ్ళెర్రజేసిన సంవత్సరం, 6. ఉప్పు, 7. జలము, 8. "చెట్టు నడిగీ, చేమ నడిగీ కూరిచితిరా—పూవుల కంఠమాల" ఏ పూవులతో ఎంకి ఆ మాలను కూర్చింది?, 10. వెంకన్న ఉన్న కొండ, 12. బంగారాన్ని ధరించేది-భూమి, 14. తెలుగు 'వినోదాలు', 16. కనిరి + ఏని, 19. రాగులు కానివారు, 20. —ప్రథమావిభక్తి.

నిలువు: 1. విలాసం గల స్త్రీ, 2. తోక ఉన్న, 3. తల్లి క్రిందులు చేసే పడ, 4. తిరుగబడిన 'పూలముర', 5. 'మిస్సైల్స్'కి తెలుగు పత్రికలు వాడుతున్న మాట, 9. కలువ పువ్వులను వికసింపజేసే రాజు. 11. భయంకరుడైన శివుడు, 13. 'ధ్వనులు'కి శ్యావ్యమైన పర్యాయపదం, 14.

## అన్యాయ దండనకు 10 లక్షల డాలర్ల పరిహారం

ఇసిడోర్ జిమ్మెర్ మన్ అనే అమెరికన్ తను చెయ్యని హత్యకు గాను 24 ఏళ్ళు జైలు శిక్ష అనుభవించాడు. అందుకు పరిహారంగా ఇటీవల న్యూయార్క్ సిటీ అతనికి 10 లక్షల డాలర్లు చెల్లించింది. 1937 లో జిమ్మెర్ మన్‌కు మొదట ఉరి శిక్ష విధించారు. కాని ఆ శిక్ష అమలు జరపడానికి 2 గంటల ముందు అది యావజ్జీవ కారాగారశిక్షగా మార్చబడింది. 1961 లో విడుదల అయిన జిమ్మెర్ మన్ ఎంత డబ్బు ఇచ్చినా దారుణమైన తన అనుభవాన్ని అది తుడిచి వేయలేదు అంటున్నారు.

"అనుకరణను మించిన పొగడ్త లేదు."

నడుస్తున్న కాలం, 15. తల తెగిన చిలుకలు, 18. తల్లక్రిందులుగా తపస్సు చేస్తున్న ముని.

## తెలివికి పరీక్ష

1. ఎన్. టి. ఆర్, జయలలిత, ఎం. జి. ఆర్, అక్కినేని, జమున, రాజ్‌కుమార్ — ఈ సముదాయంలో ఇముడని వ్యక్తిని గుర్తించండి. 2. ఏ,పి,ఇ,జి,ఐ, — ఈ వరుసలో తరువాతి అక్షరం ఏది? 3. వాయవ్యమూలకు దక్షిణం ఎలాంటిదో ఏ మూలకు పడమర అలాంటిది? 4. రామాయణంలో రావణుడు ఎలాంటివాడో భారతంలో — (శిశుపాలుడు, జరాసంధుడు, దుర్యోధనుడు, బకాసురుడు, భీముడు) అలాంటివాడు — ఎవరు? 5. కంఠాభరణం, బారిష్టరు పార్వతీశం, కన్యాశుల్కం, సరిపడని సంగతులు, మధుసేవ — ఈ సముదాయంలో ఇముడని దేది? 6. ఈగ, జలగ, దోమ, చీమ, తుమ్మెద — వీటిలో 'మశకము'నకు పర్యాయ పదం ఏది? 7. మనుష్యులలో ఎవ్వరూ మంచివారు కారు, అయితే కొందరు చెడ్డవారు కారు. అందువల్ల — (ఏ) మనుష్యు లందరూ చెడ్డవారు కాదు, (బి) చెడ్డవాడు కాని మనిషి ఎవ్వడూ లేడు, (సి) మనుష్యు లందరూ మంచివారు కాదు — వీటిలో ఏది నిజం?, 8. అతిథులుగా వచ్చే భార్య తాలూకు లేదా భర్త తాలూకు బంధు మిత్రులు ఎంత తక్కువగా ఉంటే ఆ సంసారం అంత సుఖంగా ఉంటుంది — నిజమా? అబద్ధమా?

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి:

1. అ(ఆ)ంత్రము: (ఏ) ప్రేగు, (బి) లోపలిది, (సి) ఆతురత, (డి) తామర.

2. అంధువు: (ఏ) అంధురాలు, (బి)

## జీవకణాల పరిశీలన వల్ల మానసిక వ్యాధుల నిదానం



ఒక వ్యక్తి జీవకణాలను ప్రయోగశాలలో పరిశోధించి నిరాశ, ఉన్మాదం మొదలైన మానసిక వ్యాధులకు ఆ వ్యక్తి గురి అయ్యే లక్షణాన్ని ముందుగా గుర్తించవచ్చునట! అనుమానాస్పదమైన జీవకణాలను అయస్కాంత క్షేత్రంలో వేసి పరిశీలించి ఏ కణాలలోని రాసాయనిక లక్షణాలు నిరాశా, నిస్పృహలకు దారి తీసేదీ గుర్తించి వెంటనే డాక్టర్ చికిత్సను ప్రారంభించవచ్చును.

"జ్ఞానానికి ఉచితమైన ఫలం ఆచరణ!"

పేకటి. (సి) మెయ్యి. (డి) గుడ్డివాడు.

3. అంబాలిక: (ఏ) పొడవైన కేశములు గలది, (బి) పాండురాజు తల్లి (సి) పినతల్లి, (డి) కాశీరాజు కూతురు.

4. అంబుజము: (ఏ) మేఘము, (బి) వానపాము, (సి) పద్మము. (డి) ఎఱ్ఱగన్నేరు.

5. అంభోధి: (ఏ) ఆబోతు, (బి) అమ్మల పొది. (సి) సముద్రము, (డి) ఘూణీరము.

6. అంశువు: (ఏ) కింజల్కము, (బి) వస్త్రము, (సి) కిరణము, (డి) కాంతి.

7. అంహస్సు: (ఏ) పగలు, (బి) రాత్రి, (సి) పాపము, (డి) దుఃఖము.

8. అక్షతలు: (ఏ) నక్షత్రాలు (బి) పేలాలు, (సి) బియ్యము, (డి) అక్షింతలు.

---

విస్డమ్
పోటీల కూపను
మే 1984

---

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు ఖరీదు చేసే పుస్తకం బహుమతి!




"ఇండియా అంతటికీ గొప్ప సినిమా స్టార్ అయిపోతే?" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ





8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

---

"ప్రేమ, ద్వేషం దగ్గరి చుట్టాలు!"

# పోటీలు (ఫలితాలు)

(మార్చి 1984)

వ్యాసం - మొదటి బహుమతి: వారణాశి పాపయ్య శాస్త్రి, శ్రీకాకుళం; రెండవ బహుమతి: ఎమ్. లక్ష్మణస్వామి, రాజాం, శ్రీకాకుళం జిల్లా; మూడవ బహుమతి: పి. కృష్ణమూర్తి, లింగగిరి.

క్విజ్ - జవాబులు: 1. 65 సం. లు, 2. బుధుడు (మెర్క్యురీ), 3. హిందూ మహా సముద్రం, 4. ఝరియా, రాణీగంజ్, 5. చైనా, 6. జాఫార్ ఇక్బాల్, 7. యూరి ఆంద్రపోవ్, 8. రాగి, టిన్ లోహాల మిశ్రమం.

విజేతలు - మొదటి బహుమతి: సమ్మెట వెంకటేశ్వర్లు, మహబూబాబాదు; రెండవ బహుమతి: యం. అక్బర్ హుస్సేన్, ఏలూరు; మూడవ బహుమతి: తల్లావజ్ఝల మహేష్ బాబు, కొండూరు.

పజిల్ - జవాబులు - అడ్డం: 1. పావనిశ్రీ, 3. గడమంచె, 5. కృష్ణాష్టకము, 8. పతిత, 9. రావెళ్ళ, 10. యుక్తవయస్సు, 11. ఖిత్తిగ, 12. బకాక, 13. ముది కోరిక, 16. ముత్తరాజు, 17. జుమ్మనేవి.

నిలువు: 1. పాదుకా పట్టాభిషేకము, 2. శ్రీకృష్ణా!, 3. గరిక, 4. చెళ్ళపిళ్ళ వేంకట కవి, 5. కృత యుగము, 6. ష్టమి వరకో, 7. ము,రా,స్సు,బ,క, 14. దితిజు, 15. రివాజు.

విజేతలు - మొదటి బహుమతి : ఎమ్. ఆర్.ఎమ్. ఆచార్యులు, రమణక్క పేట, కృష్ణాజిల్లా; రెండవ బహుమతి: కె. నర్సింగ రావు, బోర్లం; మూడవ బహుమతి: వారణాశి పాపయ్య శాస్త్రి, శ్రీకాకుళం.

---

## శుక్రగ్రహంలో అగ్నిపర్వతం



శుక్రగ్రహం మీద ఒక అగ్ని పర్వతం, హిమాలయా అంత ఎత్తైన పర్వతాలూ, 'గ్రాండ్ కాన్యాన్' అంత లోతైన లోయలూ ఉన్నాయని ప్యూటోరికాలోని వేధశాల నుంచి ఇటీవల జరిపిన పరిశోధనల వల్లా, రష్యా శుక్ర గ్రహానికి పంపిన అంతరిక్ష నౌకల వల్లా తెలియ వస్తూంది. రష్యా సేకరించిన సమాచారం ద్వారా శుక్రగ్రహం మీది 'బీటా' ప్రాంతంలో 200 కి.మీ. ల వ్యాసం 2,900 మొదలు 5,000 మీటర్ల ఎత్తూ ఉన్న ఒక పెద్ద అగ్నిపర్వతం ఉన్నట్టు భావిస్తున్నారు.

"ఏ కట్టెకు నిప్పంటే ఆ కట్టే కాలి పోతుంది!" - తెలుగు సామెత

తెలివికి పరీక్ష — జవాబులు: 1. అంగిక, 2. భాండారము (దీనిలో 'గా' లోపించింది), 3. శుభ్ర, 4. ఓడ, 5. అబద్ధము, 7. సంఘం, 8. సదస్యం (ఇది వివాహానికి సంబంధించింది).

(మార్చినెల సంచికలో 6వ ప్రశ్న అచ్చు కానందుకు చింతిస్తున్నాము—సంపాదకుడు)

విజేతలు: మొదటి బహుమతి: పి. వి. రమణమూర్తి, ఒంగోలు - 523 001; రెండవ బహుమతి: రామిరెడ్డి ఇందిర, విజయనగరము - 531 202; మూడవ బహుమతి: బి. హరిగోపాల్, సింగారం, వరంగల్ జిల్లా.

మాటల మహిమ - జవాబులు: 1. దొడకింది కీలు (బి), ఆపద (డి), 2. మొలక (సి), విత్తనము (డి), 3. పెద్ద అడుగు (బి), 4. చొక్కా (బి), 5. నిప్పు (సి), బొగ్గు (డి), 6 వ్రేలు (బి), అడుగులో 12వ భాగం (డి), 7. పాదము (ఏ), చెట్టు వేరు (సి), 8. కైమోడ్పు (సి), ఒక తెలుగు పినీతార (డి).

విజేతలు: మొదటి బహుమతి: ఎమ్. ఆర్.ఎమ్ ఆచార్యులు, రమణక్కపేట, కృష్ణాజిల్లా; రెండవ బహుమతి: నందం శ్రీనివాస్, మంగళగిరి; మూడవ బహుమతి: పి. శ్రీదేవి, అన్నవరం.

ముఖచిత్ర వ్యాఖ్య: మొదటి బహుమతి: ఎన్. శ్రీనివాసరావు, హనుమకొండ, వరంగల్ జిల్లా; రెండవ బహుమతి: బానంగి కిరణ్‌కుమార్, బానంగి; మూడవ బహుమతి: దాది వెంకట రంగ సూరిబాబు, కిర్లాంపల్లి.

పాఠకుల అభిప్రాయాలు మొదటి బహుమతి: ఎ.ఎస్.ఎన్. గుప్త, కొవ్వూరు; రెండవ బహుమతి: జి. శ్రీనివాస ప్రసాద్, అనంతపురం; మూడవ బహుమతి: 'శ్రీరామ దూత' పి. రాధాకృష్ణమూర్తి, విస్సాకోడేరు.

మీరైతే? - మొదటి బహుమతి: పి. లలిత, నెల్లూరు; రెండవ బహుమతి: ఎస్. ఉపేంద్రనాథ్, మెదక్.

భావపరిచయ పోటీ: మొదటి బహుమతి: శ్రీ పిల్లి ధనలక్ష్మి, విశాఖపట్టణం; రెండవ బహుమతి: ఎన్. రామలింగేశ్వర రావు, కలకోట; మూడవ బహుమతి: ఆర్. శిరీష, హనుమకొండ.

---

(8వ పేజీ తరువాయి)

అమూల్యమైన నిముషాలను నిరర్థక వ్యాసంగాలలో పడి వృథా చేసుకోకు.

అణకువ అలవరచుకో - అప్పుడే అజ్ఞాపించే అర్హత నీకు వస్తుంది. మంచి సేవకుడుగా ఉండడం నేర్చుకో - అప్పుడే మంచి యజమానివి కాగలుగుతావు.

చదువుకు అంతం అంటూ లేదు. నేర్చుకోవాలనే కోరిక, అందుకు అవసరమైన అణుకువ ఉండాలే గాని జీవితం అంతా నేర్చుకుంటూనే ఉండవచ్చు. పుస్తకాలు చదవడం వల్ల మాత్రమే కాదు; అనుభవంవల్లా, ఇతరుల దృష్టాంతంవల్ల ఎన్నో సంగతులు మనం నేర్చుకుంటాము.

దేవుడిలో గాని, ఉపాధ్యాయుడిలో గాని, తల్లిదండ్రులలో గాని భయం పెంచుకోకు; వారిని ప్రేమించడం, గౌరవించడం, నిరంతరం వారికి విధేయంగా ఉండడం అలవరచుకో; నమ్మకద్రోహం చేసినప్పుడూ, దొంగతనం చేసినప్పుడూ, ఎవ్వరినైనా హత్యచేసినప్పుడూ మాత్రమే నువ్వు భయపడాలి;

"కష్టే ఫలీ:" (కష్టపడ్డ వాడికే ఫలితం దక్కుతుంది).

